

చిలవలపలవల తాటిచెట్టు

కనిమెరకల రామారావు—'బొబ్బిలి'

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 48
సంచిక 46
20.7-55

మన్మథ శ్రావణ శుద్ధ పాడ్యమి బుధవారం




“రాత్రి ప్రశాంతిలో [illegible]” ([illegible]).

ఫోటో : [illegible]

ముఖచిత్రం: నవకేతన్ వారి "హౌస్‌నంబర్ 44" హిందీ చిత్రంలో కల్పనా కార్తిక్.

## విషయానుక్రమణిక


| | |
|---|---|
| సినిమాపిచ్చి— | 3 |
| ఉదయకిరణాలు— | 12 |
| ఒక తరహా మనిషి— | 17 |
| గ్రహపాటు— | 22 |
| వనితాలోకం— | 25 |
| అబద్ధాలపోటీ— | 35 |
| కథాగేయ సుధానిధి— | 36 |
| స్కార్లెట్ పింపర్నెల్ (సీరియల్) | 38 |
| జాన్ను మతిమరుపు— | 45 |
| బాలానాం రోదనం బలం— | 47 |
| విజ్ఞానవీధులు— | 49 |
| సినిమా— | 50 |

# సినిమా పిచ్చి

గుడిమెళ్ల బాలా త్రిపురసుందరి

★

## పాత్రలు:

| | |
|---|---|
| చిదానందం | : లోభి. |
| మంగమ్మ | : చిదానందం భార్య. |
| పరంజోతి | : చిదానందం అల్లుడు. |
| పానకాలు | : పరంజోతి స్నేహితుడు. |
| విశ్వం | : పానకాలు స్నేహితుడు. ఆంధ్రా మెట్రికుపై ఆరవ దండయాత్రకు సిద్ధమౌతున్న మేటిజోదు. |
| అంబరం | : పొరిగింటివారి అబ్బాయి. |



మొదటి రంగం.

ఉదయం. ఆకాశం స్వచ్ఛంగా ఉంటుంది. దగ్గర ఉన్న కాఫీ హోటలునుండి 'అందమె ఆనందం' అన్నపాట వినిపిస్తూ ఉంటుంది. పరంజోతి ఆదివారం సంతనుంచి వస్తున్నాడు చేతిలో కూరలబుట్ట. దారిలో పానకాలు తారసిల్లుతాడు పానకాలుది ఫ్రెంచికట్టు మీసం కళ్ళకి చలువజోడు.

పరంజోతి: చిల్లిగవ్వైనా వూడిపడటంలేదం టే నమ్మ.

పానకాలు: నెధవ బూటకపు నాటకాలు నావద్ద తీసిపారేయి!

పరం: నువ్వు ఇది అవకు బ్రదర్! ఎంత ఒట్టుపడితే, అంత ఒట్టు. అయినా నీకు ప్రస్తుతం డబ్బెందుకు?

పాన: వచ్చింది గొత్తి. ఊరికెడుతున్నపుడు ఎక్కడికని అడిగినా, డబ్బు సర్దుబాటు చేయమన్నపుడు ఎందుకని అడిగినా కార్యం సానుకూలపడదంటారు. పన కేదో ఐపోయింది నా చరిత్ర చెపుతా విను. మా ప్రక్కింటివా రమ్మాయి నాజూగా ఉంటుంది. స్కూలుఫైనలు చదువుతోంది లే. ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకోవాలని ఉంది.

పరం: దానికేమోయ్! మంచి నూటు ఒకటి ఎరువు తెచ్చుకొని ఆ అమ్మాయి తండ్రి దగ్గరకెళ్ళి సువ్వొక యూనియను రిపబ్లిక్ సర్వీసు కమీషను ఆఫీసరునని పరిచయం చేసుకో, పెళ్లి దానంతటదే అయిపోతుంది.

పాన: ఆయన చిన్నప్పటినుండి ఎరుగునురా నన్ను. నేను పనికిమాలినవాడనని తెలుసూ, నాదగ్గర చిల్లుగవ్వైనా లేదనీ తెలుసూ, నా పొట్ట చింపితే పట్టుమని పది ఇంగ్లీషు అక్షరాలైనా లేవనీ తెలుసు.

పరం: ఐతే నీ ప్రయత్నానికి నీళ్ళు వదులుకో.

పాన: డబ్బుంటే నా స్కీము కొనసాగుతుంది, మీ మామదగ్గర డబ్బు మూలుగుతోంది కదరా? నువ్వు కొంచెం సాయం చేస్తే...

పరం: ఉత్తుత్తి ఆశలు పెట్టుకొంటే ఏం లాభంరా? మా మామ నామీదే టిరనైజు* చేస్తున్నాడు. నా పెళ్ళయినప్పటినుంచీ ఇంట్లో కుర్రాణ్ణి మానిపించేశాడు. మేనరికం చేసుకొంటే త్రిశంకు స్వర్గమేరా!

పాన: ఇందులో నీకు నష్టమేముందిరా? తాడిపన్ను కల్లు తాగేవాడే భరిస్తాడు. పెచ్చాల సెరలలో నీ నాజరు ఇమిడి ఉంటుంది గా.

పరం: కథ అంత సాఫీగా లేదోయ్! నిన్న వంటచెఱువులో వేప మిగిల్చా (అగ్నిహోత్రాల అకౌంటుకి లే) మా మామ నిన్న సాయంత్రం అడితికి షికారు వెళ్ళి ఇంటికి వచ్చి నన్ను నిలదీసి అడిగేసరికి వెక్కిరియరు ముఖము వేసి నిలువల్లా నీళ్లు కారిపోయాను.

పాన: * నీవు వట్టి చాటపెయ్యవిరా! నేనైతే మీ మామమీకే టిరనైజు చేద్దును.

పరం: కలలోని వార్త. వెనుకటికి ఎవడో నీ బోటిగాడే పులి మీసాలు పట్టుకొని ఉయ్యాల లూగుతానని డబ్బీలుకొట్టి పిల్లిని చూసి గుడ్లు పీకేస్తుందేమోనని భయపడినాడుట.

పాన: ఏడిశావు లేవోయ్! మీ వాడిదగ్గర డబ్బుకుంజీ ఆ పిల్లని పెళ్లాడటానికి ప్లాను వేశాను. అది జయప్రదం కాకపోతే నా మీసంలో ఎడమభాగాన్ని తీసివేస్తా.

పరం: ఏమిటి నీ చచ్చుస్కీము చెప్పు చూతాం!

పాన: సావధానంగా విను. ఫిల్ములో నన్ను హీరోగా బుక్ చేశారనీ, నాకు నెలకు ఐదువందల జీతమనీ చెప్పితే పిల్ల తండ్రికి నామీద మోజుపుడుతుంది. చూశావా! ఏదీ! ఈ రోజుల్లో ఎవడైనా సినిమాపరిశ్రమలో వెయ్యి నూట పదహార్లు సంపాదిస్తున్నాడంటే ప్రతివాడు నమ్ముతాడు. నామీద నమ్మకం కలిగిన తర్వాత, వాళ్ళమ్మాయిని నేనే వెళ్ళి సినిమా స్టారుక్రింద బుక్ చేస్తాను. ఈ పతకంలో ఉండే కిటుకు నీకు బోధపడిందా? నీకు తెలియని దేముంది లే! రెండు రెళ్ళు ఎంతో చెప్పగలిగిన ప్రతివాడూ, యీ రోజుల్లో వాడి కూతురు వెండితెర మీద పడవలెనని ఉవ్విళ్ళూరుతాడు. అలా పడితే పితృదేవతలు తరిస్తారని ఇంటిల్లపాదీ సంతోషిస్తారు. వీధిలో వాళ్లే ఉబలాటం చెప్పాలా?

పరం: భేషుగ్గావుంది. ఉత్తుత్తి సినీ కంపెనీ ఏదో లేవదీసి గ్రంథం నడిపించు.

పాన: లాభం లేదు. ముందు డబ్బు కావాలి.

పర: డబ్బు దొరకడం దుర్ఘటం.

పాన: ఒరేయి జోతీ! నీ సహాయముంటే అది అనుకున్నంత కష్టసాధ్యం కాదురా. ఇవ్వాళ సాయంత్రం మీ మామను కదలేస్తా.

* పీటమీద ఎక్కి కూర్చుంటున్నాడు. (*Tyrannise*).

* అమాయకపు వెధవ్వి.

#  సినిమా పిచ్చి 

నువ్వు వచ్చి ఏడ్వానికి తెక్కమని రసాభాస చెయ్యకు.

పరం: దీనివల్ల నాకు లాభమేమిటి చెప్పు?

పాన: లాభమా! విను, ఒకటి–మీ మామ ద్రోహబుద్ధి నశించిపోవడం. రెండు మీ మామ కుక్కిన పేనై పిల్లైపోవటం. నీవు దానిని హుంకరించడమూనూ. మూడు ధన లాభం.

పరం: (పెదవి విరిచి) చేరి కుంకేటి కొమ్ము సాధించవచ్చు... కాని మా మామ దగ్గరనుండి దమ్మిడీ ఊడిపడదురా.

పాన: మీవాణ్ణి ఇల్లా వేళ్లమీద ఆడించకపోతే నన్ను 'గుడ్డిగాడిదా' అని పిలవరా.

(విశ్వం ప్రవేశిస్తాడు)

పాన: హలో విశ్వం! మన ప్లానుకు‡ పరంజోతిచేత ఒప్పించినాను.

విశ్వం: ఓహో!

పాన: మరి నువ్వు అసిస్టెంటు ఫిల్ము డైరక్టరుగా నాకు కొంత సహాయం చేయవలసిఉంటుంది.

విశ్వం: (సంతోషంగా) సినిమాలో నాకున్నంత ప్రవేశం ఎవరికి ఉందిరా! ప్రతి సినిమాపత్రిక సంపాదకుడూ నేను వ్రాసిన ప్రశ్నలకు సమాధానా లివ్వలేక డింకీలు కొడుతుంటాడు. మొన్న 'సినిమా విచిత్ర' వాడిని 'బినీత్ ది ట్వెల్వ్ మైల్ రీఫ్'* లో గ్లోరియా గార్డను చరిత్ర చిత్రణ బాగుందా? 'హెర్ ట్వెల్వ్ మెన్'† లో గ్రీర్ గార్సను ది బాగుందా? అంటే పల్టీ కొట్టేసి 'నే నిద్దరు కోమలాంగులకూ జోహారు చేస్తాన'ని రోట్లు వేశాడురా! టెక్నికలు విషయాల్లో కూడా నా అభిప్రాయాలదే ఉన్నత స్థానం అనుకో—

పాన: ఒరే విశ్వం – నీ తెలివితేటలు నాకు తెలియనివా?

పరం: (పానకాలతో) విశ్వంగాణ్ణి నువ్వు ముక్కుకు తాడేసి లాక్కెళ్లకపోతే సినిమా క్రిటిసిజంతో మనల్ని రోజంతా ఊదర కొడ్తాడ్రా.

విశ్వం: నిజమేరా. సినిమా ఉంటే నాకు ఆహార, నిద్రా, విహారాలు అక్కర్లేదు.

పాన: (విశ్వాన్ని జబ్బపట్టుకు లాక్కుపోతూ) గుడ్ బై పరంజోతీ! విశ్వానికి కొంత తరిఫీదు ఇవ్వవలసిఉంది. పోతాం మరి.

పరం: నమస్తే.

## 2 వ రంగం

[దృశ్యము: పరంజోతి ఇంటి పంచపాళి. పంచపాళీ మధ్య నొక కుర్చీ. కుర్చీకి ఒక ప్రక్క టేబిలు, రెండో ప్రక్క బెంచి. టేబులుకి ఒక ఇనపపెట్టి అమర్చబడి ఉంటుంది. నటీ, నటుల బొమ్మలుకల కాలెండర్లు రెండు, వెంకటేశ్వర ఆయుర్వేద నిలయంవారి కాలెండరు ఒకటి గోడమీద వ్రేలాడుతుంటాయి. నిలయంవారి కేలెండరు నాల్గుసంవత్సరాల క్రితంది. నటుల కాలెండర్లమీద తారీఖుల కాగితాలుండవు బోడిగా బొమ్మల్తో ఉంటాయి. కేలెండర్లకు ఎదురుగా ఉన్న గోడమీద, మార్కండేయుడు శివలింగాన్ని కౌగలించుకొంటున్న పటము, ఆ పటముమీద వాడిపోయిన చేమంతి దండ ఉంటాయి. మంగమ్మ ప్రవేశం]

మంగమ్మ: ఒరే జోతీ! వీ డేమైపోయాడో? ఎక్కడ కూర్చుంటే అక్కడే ఉండిపోతాడు. మామిడిచెట్టుక్రింద సోమరి† (తెరలోకి చూస్తూ) ఏమేవ్! శోభనలతా! మీ ఆయన ఎక్కడున్నాడే?

తెరలోంచి ధ్వని: అదేమిటే అమ్మా! కాఫీ పొడికి నువ్వేగా బజారుకి పంపుతా?

మంగ: అయితే యింత ఆలస్యం దేనికి?

తెరలోంచి: ఎల్లాగా బజారుకి వెడుతున్నారు కదా నేను 'కనకతార' ఫేసు పౌడరు డబ్బా తెమ్మన్నాను. వారి చిన్న మరదలు 'గార్జ్ లిప్ స్టిక్' తెమ్మంది. అబ్బిగాడు 'ఆవారా బుష్ కోటు' మంచిది చూసి తెమ్మన్నాడు.

మంగమ్మ: అఘోరించినట్లేవుంది. ఇంక సాయంత్రానికిగాని వీడు తిరిగి రాడు. వేళకి ఇంత కాఫీ పడకపోతే నేను మనిషిని కాదు. వెధవ పీనుగులు చెప్పక చెప్పక పనులన్నీ యిప్పుడే చెప్పాలీ? (తెరలోకి) ఏమే శోభనం! కాఫీ పౌడరు తెచ్చాక డబ్బాకోసం మళ్ళీ పంపించకూడదుటే?

తెరలోంచి: ఎందుకే ఇంత రాద్ధాంత సిద్ధాంతం. ఈ దినం సినిమా ప్రోగ్రాము పెట్టుకున్నాంగా! ఇవి లేకపోతే ప్రోగ్రాము భగ్నమౌతుందని పంపాను.

(వీధిలోంచి. చిదానందం ప్రవేశం. రికెట్టు బడిపంతులు—త్రేతాయుగంనాటి కిర్రుచెప్పులజోడు తొడుక్కొనిఉంటాడు. ఒక చెప్పు రింగు ఊడిపోతే తాడుకట్టి కాలక్షేపం చేస్తున్నాడు.)

చిదానందం: ఏమిటే యీ కేకలు, అంకెలూను? వీధిలోకి కూడ వినిపిస్తున్నాయి.

మంగమ్మ: ఏం చేయనండి, కాఫీపౌడరు లేదాయె.

చిదా: (తాపీగా) నిన్ననే ఎందుకు తెప్పించలేదూ? ఇవ్వాళ ఆదివారం కొట్లుండవు.

మంగ: ఇవ్వాళ సోమవారమండి. ఏదో శుద్ధ మొద్దు ఔతారానికి చెప్పినట్లు చెప్తున్నారు

చిదా: మర్చిపోయా. ఇవ్వాళ అమావాస్యట. ఒక్కకొట్టు కూడా తెరవలేదు. (చెప్పులజత మూలపెట్టి కుర్చీలో కూర్చుంటాడు.)

మంగ: గరిటయ్య దొడ్డివైపునుంచి ఏ సరకు ఎప్పుడు కావలసినా అమ్ముతాడండి.

చిదా: (విసుగ్గా) ఒక్కపూట అది పడకపోతే ఉండలేవు కామోసు. ఈ వెధవ కాఫీలకీ, సినిమాలకీ, సినిమా పత్రికలకీ నా ఆస్తి అంతా అశ్రుతర్పణమైపోతోంది.

మంగ: ఉన్న డబ్బు ఖర్చైపోయిందని గుండె బాదుకోపోతే ఏదైనా అదనంగా సంపాదించడానికి ప్రయత్నం చేయకూడదండీ?

చిదా: అరవయ్యో పడిలో పడబోతూంటే డబ్బు సంపాదన ఎల్లా సాగుతుంది చెప్పు?

మంగ: తొక్కితే అనేక దారులుంటాయి. సినిమా పరిశ్రమ చూడండి. రూపాయికి పది రూపాయలు లాగవచ్చు అందులో. ఇంతకీ చెప్పడం మరచిపోయాను. శోభనలత యివ్వాళ 'వద్దంటే డబ్బు' ఫిల్ముకి వెడదామని వేధిస్తోంది.

చిదా: ఆ లచ్చుక్కకి ఇంత సినిమా పిచ్చేమిటే? శోభనలత, గీభనలత అని వెధవ పేరులు పెట్టి దాన్ని పూర్తిగా పాడుచేశావు.

మంగ: నేనేం చేశానండి! అది అల్లా పిలవమంటే ముద్దుగా పిలుస్తున్నాను.

---

‡ పథకం (*Plan*)

* *Beneath the Twelve Mile Reef—(A 20 th Century Fox 3-D production)*

† *Her Twelve Men (a M.G.M picture.)*

† మామిడిచెట్టుక్రింద నోరు తెరచుకొని కూర్చొని తానెట్టి ప్రయత్నం చేయకుండానే మామిడిపండు నోటిలో పడుతుందనుకొను బద్ధకస్తుడు.

ఏమిటో! మీ మాటలు వింటూంటే ప్రాణం చివుక్కుమంటుంది.

చిదా: నువ్వే ఇదంతా లేవ్వెట్టి ఉంటావు. కడుపునిండా భోజనం చేసి ఇంట్లో కూర్చోలేక ఏమిటిదంతా? గడ్డానికి అణా కూడ ఖర్చు పెట్టడానికి మనస్సొప్పక ఇంచేలు పడుతూంటే...

మంగ: అదేమిటండీ! మీరు బొత్తి గానూ!

చిదా: లాభం లేదు. ఈ ప్రస్తావన ఇంక వద్దు.

మంగ: (మూతి ముడుస్తూ) పిల్లల సరదాలు మనం తీర్చకపోతే ఎవరు తీరుస్తారు చెప్పండి? పోనీ—మీకు కష్టంగా ఉంటే డబ్బు ఇవ్వడం మానేయండి. జోతి ఏర్పాటు చేశాడు లెండి.

చిదా: ఏమిటా ఏర్పాటు? ఆ చచ్చు పీనుగ మాటలు నమ్మకండి.

మంగ: వాడంటే మీకంత చులకన ఏమిటండీ? వాడి స్నేహితుడు సినిమాలో పెద్ద ఉద్యోగస్తుడుట. ఆ స్నేహితుడి ఫిల్ము ఈ ఊళ్లో ఆడుతోందిట. స్నేహరీత్యా స్నేహితుడు పరంజోతిని కుటుంబ సహితంగా ఈరోజు ఫిల్ము చూడటానికి రమ్మన్నాట్ట. మనవాడు మిత్రునిమాటలు కొట్టేయలేకపోతున్నాడు.

చిదా: (తమాయించి) అయితే నా అభ్యంతరం లేదు. డబ్బుమాట ఎత్తకుండావుంటే, మీరు ఎన్ని సినిమాలు చూచినా, ఎన్ని నాటకాలాడినా నేను కోపపడను.

మంగ: అబ్బా! ఇప్పటికి దేవతలు తరించారు. డబ్బుకి ఇన్ని ముళ్లేస్తే ఎల్లాగండి? డబ్బు చూసుకొని మురవడానికా? తిని ఆనందించడానికా?

[వీధిలోంచి జోతి వస్తాడు. ఒక చేతిలో పౌడరు డబ్బా, ఉడుకులాం సీసా ఉంటాయి. రెండవ చేతిలో బుష్‌కోటు, వాయుపూరితమైన రెండు గాలి బుడగలు ఉంటాయి.]

— చిదా: ఒరే పరంజోతీ! ఎవడురా ఆ స్నేహితుడు?

పరం: ఎవడు మామయ్యా వాడు?

మంగ: (చిదానందంతో) తిరిగి తిరిగి వస్తే ప్రశ్నల వర్షం కురిపించి వాణ్ణి ముద్ద చేస్తారేమిటి? అసలే వాడు ఖంగారుగొడ్డు. మీ దగ్గర వాడికి ఉన్న మతి కాస్తా పోతుంది. లోపలికి పోరా, జోతీ! ఆయనతో ఏమిటి?

(జోతి లోపలి గది గుమ్మం దగ్గరికి 'బ్రతుకు జీవుడా' అనుకుంటూ వెళతాడు.)

మంగ: (వాడిని సమీపించి చెవులో) ఒరేయ్! ఈరోజు సినిమాకి నీ స్నేహితుడు మనల్నందరిని ఊరికే తీసుకెళతాడని మీ మామయ్యతో చెప్పి ఒప్పించేసరికి తల ప్రాణం తోకకు వచ్చింది. పక్కింటి తాయారమ్మగారివద్ద పది రూపాయలు చేబదులు చేసి పట్టుకువచ్చా. ఇదిగో తీసుకో! (చిదానందం చూడకుండా కొంగున కట్టిన మూటవిప్పి పది రూపాయల నోటు తీసి పరంజోతి చేతిలో పెడుతుంది.) దీంతో టిక్కెట్లు కొను. ఈ సంగతి మామయ్యకు తెలియనివ్వకు.

పరం: (ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ) ఓస్! నేనంత వెర్రివాడ ననుకున్నావా అత్తా? నా జేబు ఖర్చుకి ఇందులో ఒక రూపాయి జమకట్టుకుంటా - ఏం?

మంగ: నీకు ఖర్చులేమున్నాయిరా? పోనీ అడిగావు కాబట్టి ఓ పావలా తీసుకో.

[పరంజోతి, మంగమ్మ ఒకళ్ళ వెనకాల ఒకళ్లు ఇంట్లోకి వెళతారు. వీధిలోంచి పానకాలు ప్రవేశిస్తాడు. కాళ్లకు పెషావరు శాండలు, కళ్లకు చలువజోడు, నెత్తిమీద దొర టోపీ ఉంటాయి. లాల్చీ తొడుక్కొని లాగులో 'టకప్' చేసుకుంటాడు.]

చిదా: ఏంరోయ్, పానకాలూ! పెద్దవాడివయ్యావు. ఎప్పుడొచ్చేవు?

పాన: ప్రొద్దున్నేనండి.

చిదా: ఏమిటికథ? అల్లా కూర్చో (బెంచి చూపిస్తాడు. పానకాలు బెంచి మీద కూర్చుంటాడు.)

పాన: మద్రాసులో ఉద్యోగం చేస్తున్నానండి.

చిదా: ఏంపనిరా?

పాన: స్టుడియో మేనేజరునండి. నెలకి నాలుగువందలు ఇస్తారండి. కాని ఏం సరిపోతుందండి పట్నంలో -

చిదా: (విషణ్ణవదనంతో) బాగా ఉందిరా. నువ్వే మెరుగు. మావాడికంటె. కూర్చోపెట్టి మేపుతున్నా వాణ్ణి.

పాన: ఏదో వెనకాల ఉన్నవాళ్ళకి ఉద్యోగాలెందుకండి?

చిదా: అదే తప్పు. నాకేమీ లేకనా నేను బడిపంతులు ఉద్యోగం వెలగపెడతి? 'ఉద్యోగం పురుషలక్షణం' అన్నారు. ఊపిరి ఉన్నంతవరకూ మొగవాడు డబ్బు గడించాలి.

పాన: మా స్టుడియోలో ఓ చిన్న నౌకరీ ఉందండి. నెలకు మూడువందలు జీతం. 25 ఏళ్లవాడు కావాలి.

చిదా: మా పరంజోతిని దూర్చరా అందులో. వీడిక్కడ చేసేపనేముంది? కుండల్లో గుర్రాలు తోలడంతప్ప -

పాన: మీరు అల్లా అంటారుగానండి. వాణ్ణి అసలు పంపుతారూ?

చిదా: ఎందుకు పంపనురా? నీకేం పిచ్చేమిటి? మా రెండోదాని పెళ్ళిచేసిన తర్వాత ఇద్దరి అల్లుళ్ళకి ఇల్లరికం ఇవ్వగలనా? ఈ పెద్దాణ్ని ఎల్లాగా తరిమెయ్యవలసివస్తుంది. వీడు రానురాను గాదిక్రింద పందికొక్కులా తయారౌతున్నాడు.

పాన: ఛా - అల్లా అనకండి. వాడి మనస్సు విరిగిందంటే గుమ్మం తొక్కుతాడా? మీరు మిక్కిలి నేను చెప్పిన నౌకరీలో వాణ్ని మొదటే దూరద్దామనుకున్నా.

చిదా: ఐతే! చూడు పానకాలూ! మీ స్టుడియోలో ఎంతమంది ఉద్యోగస్థులున్నారు?

పాన: మొత్తంవెయ్యిన్నొకటి. వీళ్లకి జీతాలు ఎంతెంతనుకున్నారు? పదివేల దగ్గర నుంచి వంద దాకా ఉంటాయి. స్వీపరుకు వంద. అంతకంటె తక్కువ జీతం ఎవరికీ ఉండదు.

చిదా: పానకాలూ! ఇంత లావుగా జీతాలివ్వడానికి డబ్బు ఎక్కణ్ణించి వస్తోందంటావ్?

పాన: అదేమిటండీ! మీరు సత్యకాలపు మనిషిలా మాట్లాడుతారు. ఈ రోజుల్లో ప్రతిరోజూ సినిమాకి వెళ్లనివాడెవడన్నా ఉంటాడా? ప్రజలదగ్గరనించి వచ్చిన డబ్బంతా ఏమౌతుందనుకొన్నారు? నదీనాం సాగరో గతిః అని అంతా మా స్టుడియోకి కొట్టుకువచ్చేస్తుంది. ఏ తుక్కుజీ ఫిల్ము తీసినా నష్టాలు పోను సుమారు లక్షరూపాయిలు లాభం మిగులుతుంది.

చిదా: ఒక్కొక్క ఫిల్ముకి పెట్టుబడి ఎంతుందంటావ్?

పాన: ఎంతోనాండి. పాతికవేలుంటే ఫిల్ము తయారౌతుంది. సినిమావాళ్లు లక్షలు ఖర్చుపెట్టామని పేపర్లలో రాస్తారుగాని, అదంతా శుద్ధ అబద్ధమండి. రెండు పుంజీల పచ్చనోట్లుంటే పని ప్రారంభించవచ్చు. ఆక్టర్లకీ, డైరక్టర్లకీ ముందు మొండిచెయ్యి చూపించి తరువాత వాళ్లు కోర్టుకి మనల్ని యీడుస్తామని హడలగొడితే లాభాల్లోంచి వాళ్ల జీతాలు పంచెయ్యొచ్చు.

చిదా: ఈ ఖర్చులన్నీపోను ఒక లక్ష నికరం మిగులుతుందంటావా?

పాన: లక్షేమిటండీ? ముండా లక్ష. చెత్త ఫిలింకి లక్ష. మంచి ఫిలింకి పది లక్షలు. 'చంద్రలేఖకి' కోటి రూపాయలు మిలిగిందండి.

చిదా: (ఉత్సాహంతో) గంగా ప్రవాహంలా వచ్చి పడుతుందంటావేమిటిరా డబ్బు?

పాన: అంతే అనుకోండి. మొన్న మా బాబయ్యగారి వూళ్ళో ఎల్లయ్యగారు 'తొత్రిమల్లయ్య' సినిమా తీసి ఐదులక్షలు గడించారు. మీరు కూడా అల్లాంటి దేదో తీయరాదండీ!

చిదా: ఒరేయి! నాకు భక్తిరసప్రధానమైన కథలంటు అభిరుచిరా.

పాన: ఐతే 'భద్రాద్రి రామదాసు కథను' ఫిల్ముక్రింద తీసెయ్యండి.

చిదా: ఒరే పానకాలూ! నువ్వు

 సినిమా పిచ్చి 

ఖర్చం పెట్టక గుట్టువిడిచి చెప్పరా! పెట్టుబడి లేకుండా ఏదైనా ఫిల్ము తీయొచ్చా?

పాన: అది సులభసాధ్యం కాదండి. అసాధ్యమనే చెప్పాలి.

చిదా: ఏంచేతంటావు? లాభంలోంచి వాళ్ల బాకీలు తీరుస్తామంటే ఊరుకోరురా?

పాన: కొందరు ఊరుకుంటారు. కొందరు ఊరుకోరండి.

[విశ్వం ప్రవేశిస్తాడు చేతికి రిస్టువాచి, కాళ్లకి బూట్సు, ఒక కంటికి మోనకిలు† ఉంటాయి. బుష్‌కోటు తొడుక్కుంటాడు. పై పెదవిమీద యిరుపైపులా అర్ధచంద్రాకృతిలో కత్తిరించిన మీసాలుంటాయి. నెత్తిమీద ఎన్. సి. సి. టోపీ, చేతిలో చిన్న అటాచికేసు * ఉంటుంది.]

విశ్వం: కవిరాట్ చిదానందంగారిల్లిదేనాండి?

చిదా: ఔనండి. దయచేయండి. తమ పేరు?

విశ్వం: నేను 'ఫిఫీను సెంచరీఫాక్సు' పిక్చర్సువారి డిప్యూటీ డైరక్టరునండి. నా పేరు అబద్ధాల గాంధోళి.

చిదా: (పానకాలు చెవిలో) ఒరేయి–ఈయన కెంత జీతముంటుందంటావ్?

పాన: (చిదానందం చెవిలో) అధమం రెండు వేలకు పై చిలుకే—

చిదా: (కుర్చీలోంచి లేచి కుర్చీ చూపిస్తూ) అయ్యా! ఇల్లా దయచెయ్యండి.

['అటాచీ'కేసు టేబిలుమీదపెట్టి విశ్వం కుర్చీమీద కూర్చుంటాడు. యోగానందం వెళ్ళి పానకాలు ప్రక్క బెంచీమీద కూర్చుంటాడు.]

విశ్వం: మీరు 'పురాణ కల్పతరువు'లో వ్రాసిన పద్యరత్నాలు చూచి సంతోషించానండి.

చిదా: (చిరునవ్వుతో) ఏదో రాశానండి. ఊరికే కూర్చుంటే ఏం తోస్తుంది? పద్యానికో తృణమైనా రాకపోతుందా అని.

పాన: (దిగ్గునలేచి చిదానందంతో) ఆ పద్యాలు నేనూ చదివానండి. కవిత్వం ఎలా ఉందనుకొన్నారు? పాలకోవాలా, ద్రాక్షాపాకంలా ఉంది.

† ఒకటే అద్దంగల కంటిజోడు.
* తోలు పెట్టె.



ఇక శైలో? అరబ్బీగుఱ్ఱంలా కదనుతొక్కింది. భావాలు ఆకాశాన్ని అందుకుంటే మాటలు పాతాళాన్ని చూచాయి.

విశ్వం: (పానకాలుతో) మీరేం చేస్తున్నారండీ?

పాన: మెట్రో స్టుడియో మేనేజరునండి.

విశ్వం: మనం ప్రతిస్పర్థులమన్నమాట?

పాన: దానికేంలెండి. ధర ఎక్కువ పెట్టినవాడిదే తుదివస్తువు. 'బిజినెస్ ఈజ్ బిజినెస్'*

విశ్వం: అంతేలెండి. డబ్బుతో కొండమీదికోతిని దింపొచ్చు. చిదానందంగారూ! మేమొక పౌరాణిక చిత్రపటం తీస్తున్నామండి. దానికి సినేరియో * వ్రాసే మంచికవు లెవరూ దొరకలేదండి. వెదకి వెదకి విసికిపోయాం. మీ పద్యాలు చూసిన తరువాత కొంత తేరుకొన్నాం. సినేరియో వ్రాయడం మీ కప్పగించదలచుకొన్నాం. పనులన్నీ సినిమా ప్రొప్రయిటరు నామీద వదిలేస్తాడండి. అవన్నీ సక్రమంగా నిర్వహించేదాకా నాకు నిద్రపట్టదు.

చిదా: అంతేలెండి మరి. సజ్జనులు పరహితంకోసం పాటుపడతారు. ఐతే యీ బరువు నేను మొయ్యవలెనంటారా?

విశ్వం: ఇంకా సందేహమా? మీరు వ్రాసినమాటలు, పాటలు నలభీమపాకాన్ని పడతాయి. మీరు కోరినంత ఇస్తాం. పని కాస్త తొందరగా ముగించాలి. అంతే నా మనవి.

పాన: (చిదానందం చెవిలో) చిదానందంగారూ! మీరు అట్టే మెత్తబడకండి.

చిదా: (విశ్వంతో) నాల్గు వందలైనా లేకపోతే యీపని చేతకాదండి.

విశ్వం: రైటో – ఒప్పుకున్నాం. అగ్రిమెంటు కాగితాలు టైపు చేయించి పట్టుకొచ్చా.

(తోలు పెట్టెలోంచి వాటిని తీసి) ఇదిగో! సంతకాలు పెట్టండి. శుభస్య శీఘ్రం అన్నారు.

(చిదానందం అగ్రిమెంటు కాగితాలు పుచ్చుకొంటాడు)

చిదా: (తెరలోకి) పరంజోతీ! కలం, సిరాబుడ్డీ. ఇల్లా పట్టుకురా!

పాన: నా ప్రార్థనకూడా వినండి చిదానందంగారూ! మా స్టుడియోవాళ్లు 'మార్కండేయపురాణం' ఫిల్ము తీద్దామనుకుంటున్నారు. దానికి 'సినేరియో' మీచేత వ్రాయించడానికి ఏర్పాటు చేయమని మా ప్రొప్రయిటరు నన్ను మీ దగ్గఱికి పంపాడు. సినేరియో రాస్తే మీకు నాలుగు వేలిస్తాం.

* వ్యాపారం [illegible] నిదే.
* పాత్రలమాటలు, పాటలు.

ఊఁ అంటే సరి. ఏం?...ఇదిగో! రాస్తున్నా (జేబులోంచి ఖాళీ చెక్కులున్న కాన్సిల్డు చెక్కు బుక్కు పాతది తటాలున లాగుతాడు.)

విశ్వం: (చిదానందంతో) వారు నాలుగువేలన్నారుగాని నేను ఎనిమిదివేలివ్వడానికి సిద్ధంగా వున్నాను.

పాన: (ఉద్రేకంతో వెళ్లి చిదానందం చేతులు పట్టుకొని) మేం పదివేలు యివ్వడానికి సిద్ధంగా ఉన్నాం, మీరు ఊఁ అనండి.

విశ్వం: (కోపంతో పానకాలు నుద్దేశించి) మీరు ఆయన్ని గాబరా పెట్టకండి. ఏమండోయి, చిదానందంగారూ! ఇది మీ మొదటి 'సినేరియో' కాబట్టి ఎనిమిదివేలిస్తాను. రెండో చిత్రపటానికి సంభాషణలు రాస్తే పదివేలిస్తాము. ఒప్పుదల అయితే రెండింటికి ఇప్పుడే అగ్రిమెంటు రాసుకుందాం.

చిదా: పానకాలూ! నువ్వేం చెబుతావు?

పాన: మొదటి ఫిలుముకి పదివేలిస్తా.

చిదా: రెండోదానికి—

పాన: నేను నీళ్ళల్లో కొమ్ములుదాచి [illegible] బేరమాడనండి. అల్లాంటి అవకతవకలు చేస్తే మా ఆడిటర్సు† హర్షించరు. రెండోదాని సంగతి ఇప్పుడు చెప్పలేం.

[పరంజోతి సిరాబుడ్డి, కలం పట్టుకు వచ్చి నుంచుంటాడు.]

చిదా: చూడు పానకాలూ! నువ్వు కుర్రవాడివైనా అంతా తెలిసినవాడివి. మరి పద్దెనిమిది వేలకు తూగలేనంటున్నావు మరోలా అనుకోకు. ఆయన పరాయివాడు. ఎంతో దూరంనుంచి వచ్చాడు. ఆయన మాట కొట్టేయడం ఏం మర్యాదగా ఉంటుంది? గాంధోళీగారూ! కాగితాలివ్వండి. దస్కత్తు చేస్తా. (విశ్వం అగ్రిమెంటు కాగితం అందిస్తే చిదానందం పైనించి కిందికి చూసి దస్కత్తు పెట్టి తిరిగి విశ్వానికి యిచ్చేస్తాడు.)

పాన: (చిదానందం చెవిలో) ఎందుకైనా మంచిది కంట్రాక్టు సొమ్ము కొంత అడ్వాన్సుగా పుచ్చుకోండి.

చిదా: గాంధోళీగారూ! కంట్రాక్టు సొమ్ములో ఏదో తోచింది కొంత ఇప్పించండి. నేను సుదినం. వెంటనే పని ప్రారంభిస్తా.

విశ్వం: ఒక వందరూపాయల నోటిస్తా తీసుకోండి.

చిదా: వందకి, వెయ్యికి నేను కక్కూర్తి పడతాననుకున్నారా? కంట్రాక్టు సొమ్ములో మూడవవంతు అడ్వాన్సుగా యిప్పించండి. కొంచెం డబ్బుకి ఇబ్బందిగా ఉంది.

విశ్వం: పెద్దపెద్ద కంపెనీలవాళ్లు అడ్వా

† లెక్కలు తణిఖీ చేసేవారు.

న్నలు యివ్వడం, పుచ్చుకోవడం ఉండదండి.

చిదా: అల్లాఅయితే మరి బండిసాగదు.

విశ్వం: పోనీ మీ శెలవు ప్రకారమే కానిద్దాం.

(దొంగ చెక్కు బుక్కులోంచి ఒక చెక్కురాసి) ఇదిగో! పదివేలకి చెక్కు. ఇక శెలవు. పదిరోజుల్లో వస్తా. సినేరియో సిద్ధంచేసి ఉంచండి.

(విశ్వం నిష్క్రమిస్తాడు)

చిదా: ఒరే పానకాలూ! ఈ చెక్కు మారుతుందిటరా?

పాన: నిక్షేపంలా.

(చిదానందం బెంచీమీదనుంచి లేచి వెళ్ళి కుర్చీలో కూర్చుంటాడు. ముఖంలో ఆనందం పొంగిపోతూ ఉంటుంది.)

పాన: ఆయ నివాళ పక్కని త్రొక్కి వచ్చాడండీ! మీకు గమ్మత్తుగా పేపరా కాడు.

చిదా: (తెల్లబోయి) అదేమిటిరా అల్లా అంటావు?

పాన: మీరు రెండురోజు లూరుకుంటే ఇంతకన్న మంచి బేరం దొరికేది.

చిదా: ఇప్పుడు వచ్చిన నష్టమేమిటిలే. ఎప్పుడు మంచి బేరం దొరుకుతే, అప్పుడే చెక్కుబేరాన్ని తన్ని పారేయవచ్చు. 'ధనాతురాణాం నభయం నలజ్జ' అన్నారు పెద్దలు.

పాన: (కొంచెముసేపు ఆలోచించి నిటుక్కున తల పంకించి) ఇందాకా మీరు మరుపు లేకుండా ఫిల్ము తీయొచ్చా అన్నారు జ్ఞాపకముందా?

చిదా: (కుతూహలంతో) ఏం? అలాంటి కిటుకేదైనా ఉందేమిటి?

పాన: ఇప్పుడొచ్చినాయనను కూడ కట్టుకొంటే మనం చేయలేని పని ఉండదు.

చిదా: (ముఖం చాటంత చేసుకొని) ఆయన మన కనుకూలపడతాడంటావా?

పాన: దానికేముందండీ! ఆయనకు ప్రస్తుతం నెలకు మూడు వేలు ముట్టుతోంటే మనం ఐదు వేలు ఇస్తామంటే సరి.

చిదా: అంత వాడి కివ్వడానికి ఎక్కడిదిరా? చేతిలో చిల్లు కాని అయినా లేకుండా మనం పని ప్రారంభించదలచాం గా?

పాన: దానికేం లెండి. లాభంలోంచి జీతం తీసుకోమనొచ్చు. అదిగాక ఆయనకు పర్వతమంత పలుకుబడి ఉంటుంది. నటీమణులను, కెమేరా వాడిని, అదే పరంపై వాడే బుక్ చేస్తాడు. ఖర్చులుపోగా మిగిలినది మనం జేబులో వేసుకోవచ్చు.

చిదా: (పానకాలు భుజం తట్టి) తెలివనగా నీదిరా! కొండకి భూమికి వెంట్రుకతో ముడి పెడుతున్నావు అఖండుండా గాడువని. మా పరంజ్యోతికి నీకున్న ఇంగిత జ్ఞానం లేదురా! కాని ఓ విషయం జ్ఞాపకముంచుకో. వ్యవహారమంతా నాపేర జరిపించు. 'లాభాలు మనం జేబులో వేసుకోవచ్చు'నడం మానేయి. 'లాభాలు మీరు జేబులో వేసుకోవచ్చు' అంటూండు. తెలిసిందా? నీకేదో జీతం ఏర్పాటు చేస్తాను.

పాన: నెల కైదువందల రాళ్ళు తక్కువ ముట్టచెపితే నాకు సరిపడదండి.

చిదా: (విసుగుతో) అదంతా నీకు సంతృప్తికరంగా ఫైసలు చేస్తా. ముందు గాంధోళిగారి దగ్గరకు వెళ్లి ఆయన మెడను వంచు.

పాన: అల్లాగేనండి. (పానకాలు వీధులోకి వెడతాడు.)

చిదా: ఒరే జ్యోతీ! మొద్దు రాచిప్ప లాగ పలకవేంరా?

మంగ: (పంచపాళీలోకి వచ్చి) వాడు ఇంట్లో లేడండి. సినిమాకి వెళ్లటానికి బండి తీసుకొని రావడం నిమిత్తం వెళ్ళాడు.

చిదా: వాడిల్లా రాలేదే!

మంగ: పెరటి గుమ్మంగుండా వెళ్లాడు లెండి.

చిదా: బండి వస్తే తిరిగి పంపెయ్యండి. దమ్మిడీకూడా ఖర్చుచేయనని ఒట్టు వేసుకొన్నంత పని చేసి ఏమిటి యీ దుల్బాజీ వేషాలన్నీ - దుబారాఖర్చులు మానేయండి! నామాటవిని!

మంగ: పోనీ నడిచేవెడతాం లెండి.

చిదా: నువ్వల్లా ఏడుపుమొహం పెట్టకు. ఇదిగో! నేనెందుకు సినిమాకు వెళ్ళవద్దన్నానో కొంచెం ఆలోచించుకో. మళ్ళీ మాఘమాసం వచ్చేటప్పటికి మన ఇంట్లోనే సినిమాను ఆడింపిస్తా.

మంగ: ఏమిటో! మీ విచిత్రపు కబుర్లు నాకు బోధపడటం లేదు.

చిదా: (కొంచెం దగ్గిరికివచ్చి మెల్లిగా) నేను ఫిల్ము తీయిస్తున్నా.

మంగ: (ఆనందంతో) నిజంగానే? డబ్బు సంపాదనలో మీ కింత తెలివి ఉందని ఎప్పుడూ నే ననుకోలేదండి. మీ ఫిల్ము చూస్తాము. ఈఫిల్ము చూస్తాము.

యోగా: ఇవ్వాళ వర్జ్యంపూటా సినిమాకి వెడతారా?

మంగ: మీకు సమాధానం చెప్పలేమండి. ముసలితనంలో పిసినిగొట్టుతనం ఎక్కువౌతోంది. (రివ్వున లోపలికి వెళ్లిపోతుంది. వీధిలోంచి పానకాలు విశ్వం తిరిగి ప్రవేశిస్తారు. పానకాలు చేతిలో డాక్యుమెంటు కేసు* ఉంటుంది. విశ్వం పట్టులాల్చీ పట్టు పంచి తొడుక్కుంటాడు. ఒకభుజంమీద జరీ అంచు కండువా ఉంటుంది. విశ్వాన్ని చూడగానే చిదానందం కుర్చీలోంచి దిగ్గున లేచి బెంచీమీద కూర్చుంటాడు. విశ్వం కుర్చీలో ఠీవిగా కూర్చుంటాడు. తదుపరి

* దస్తావేజులు పెట్టుకొనే తోలుసంచి.

## రచయితలకు మనవి

### మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపే వారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫొటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి నెగటివ్ లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫొటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు

# ★ సినిమా పిచ్చి ★

పానకాలు తోలుసంచి బెంచీమీదపెట్టి చిదానందంప్రక్క చతికిలబడతాడు.)

పాన: (నుదుటిమీద అప్పుడే పోసుకొన్న నీటి బిందువులను జేబురుమాలుతో తుడుచుకొంటూ) అబ్బా! ఈయనని పట్టుకోడానికి భగీరథప్రయత్నం చేయవలసి వచ్చింది. విద్యార్థులసభలో 'విద్యార్థి లోకంలో పౌరాణిక చిత్రపటాల మహత్తా'నే విషయంపై ఇటు ఈయన గంభీరోపన్యాసం యిస్తూంటే విస్తుపోయిన విద్యార్థి బృందం అటు సముద్రఘోష చేస్తోంటే అరగంటవరకూ చాపిలుపే యీయనకు వినిపించిందికాదు.

చిదా: (పానకాలుతో) నువ్వు పడిన శ్రమకు నిన్నేమని పొగడాలో తెలియటం లేదురా!

పాన: (చిదానందంతో) గాంధోళీగారూ, మీతరఫున నేను ఒప్పుకున్న షరతులేమంటే - ఒకటి. అన్ని కాగితాలు మీపేర నడవడం. రెండు - వచ్చిన లాభాలు ఇద్దరు సమంగా పంచుకోవడం. మీకిద్దరికీ వచ్చిన వంతులో ప్రతిఒక్కరూ సగం సగం నాకిచ్చేయడం. మూడు - అంతకంటే నాకు వేరే జీతం నిర్ణయించకపోవడం. నాల్గు - నటీనటులకు, ప్రచురణకు ఆయన ఇరువది వేలు, సెల్యూలాయిడుకి మీరు ఇరువది వేలు పెట్టుబడి పెట్టడం. ఐదు - ఆపైన ఏ ఖర్చయినా గాంధోళీగారి అకౌంటున వ్రాసేయడం.

చిదా: (పానకాల చెవిలో) ఓరి నీ దుంపతెగా! ఏ ఖర్చు లేకుండా ఫిల్ము తీయిస్తానన్నావుగా! నా తాడు తెంపవలిచావేమిటిరా?

పాన: (చిదానందం చెవిలో) ఆ వుద్దేశంతోనే గేలం వేశానండీ. చేప పడలేదు.

చిదా: (పానకాల చెవిలో) నటీనటులకు నేను ఏర్పాటు చేస్తానని చెప్పు. మా పరంజ్యోతిగాణ్ణి, లచ్చక్కను నాయకీ, నాయకుల క్రింద, నిన్ను విలన్ క్రింద వేయిస్తాను.

పాన: (చిదానందం చెవిలో) ఆయన ఒప్పుకోడేమో! నాకంటె ముందే లప్పాం స్టుడియోవారు, టప్పాం పిక్చర్సువారు, ఇదే ప్లానుమీద యీయన్ని వలలో వేసుకుందామని అరుగుమీద కూచుంటే యీయన్ని నేను అమాంతంగా బుట్టలో వేసుకొని కొడ్డిదారినే ఇక్కడకు తీసుకువచ్చా.

చిదా: (పానకాలు చెవిలో) ఓరి నీ తస్సదియ్యా! డబ్బెక్కడనుండి వస్తుందిరా? ఆయన్ని నే చెప్పినట్లు అడిగి చూడరా!

పాన: (విశ్వంతో ప్రకటంగా) డైరక్టరుగారూ! మరోలా అనుకోకండి. ఏ రింట్లో ఒక మొగస్టారు, ఒక ఆడస్టారు ఉన్నారు. అందుచే నటీ, నటుల కొతా ఆయనకు వదిలివేసి సెల్యూలాయిడు వగైరా ఖర్చు మీరు పెట్టుకోండి.

విశ్వం: (పానకాలుతో) మీరు దేవహంతకుల్లా ఉన్నారే! కాలికేస్తే వేలికి, వేలికేస్తే కాలికి ముడిపెడుతున్నారు. మీ చెప్పినట్టే కానివ్వండి. అయితే ముందే, కోకిలగాన రత్నాన్ని 'హీరోయిను'గా ఇరువదివేలకి బుక్ చేసి అడ్వాన్సుగా పదివేలు యిచ్చి వచ్చా. ఇల్లా వస్తూ వస్తూ ఒకటోరకం చిత్రాన్ని ప్రేక్షకుల కందిద్దామనే ఉద్దేశ్యంతో గప్ శప్ అనే హాస్యరస నటకుల్ని పదివేలకి బుక్ చేసి, ఐదు వేలు ఇచ్చి వచ్చా. ఎంచేతంటే చిత్రానికి నాయకురాలు అంతఃప్రాణమూ, కామిక్ యాక్టర్లు బహిః ప్రాణాలున్నూ. ఈ డబ్బంతా నాకు చిదానందరావుగారివద్ద నుండి మీరు ముట్టచెప్పవలసి ఉంటుంది. పానకాలుగారూ!

చిదా: (పానకాలు చెవిలో) ఇదేం నాకు నచ్చలేదురా!

పాన: (చిదానందం చెవిలో) మీరు బెంబేలు పడకండి. మీపేర నేను అగ్రిమెంటుపై దస్కత్తు చేశానుగా! శిఖపట్ల గోత్రానికి వాడు సిద్ధమైతే నా కిదేమీ తెలియదని బుకాయించండి. బాధ్యత నామీదికి మీరూ, మీ మీదకు నేనూ తోసేస్తే మొత్తానికి అగ్రిమెంటు 'నల్ అండు వాయిడ్' అవుతుంది.

విశ్వం: మీ కమిటీలో ఆలోచిస్తున్నారు. మీరంతా గూడుపుఠాణీచేసి నాకు బ్రహ్మాజమానం చేసేట్టుంది. అగ్రిమెంటు కొన్నిలు చేశేయండి. నేను వెళ్ళిపోతా. (అంటూ లేవబోతాడు.)

చిదా: (విశ్వాన్ని కూర్చోపెట్టి) మీ తొలూకు పెట్టుబడి రానీయండి. ఇదిగో! నా తొలూకు పెట్టుబడి (బొడ్డులోంచి కాళీ సంచి తీసి పానకాల చేతిలో పెడుతూ) మన సొమ్ములు పానకాలు వద్ద ఉంచుదాం. పానకాలుని చిన్నప్పటి నుంచి నేను ఎఱుగుదును. మహానమ్మకమైన వాడులెండి.

విశ్వం: (జేబులోంచి దొంగ చెక్కు బుక్కు తీసి చెక్కు రాసి) చేసినఖర్చుపోగా అనుకొన్న సొమ్ములో ఇంకా ఇవ్వవలసిన బాపతు ఐదు వేలు. (చిదానందంతో) ఏమండోయ్! డబ్బుదగ్గర వాడూ వీడూ అనుకోకూడదు. మీడబ్బు నా చెక్కు డబ్బు కలిపి మనపేర ఇంపీరియల్ బ్యాంకులో వేద్దాం. డ్రా చేయవలసినప్పుడు నాతో చెప్పకుండా మీరు బ్యాంకులోంచి ఐదు రూపాయలకంటె ఎక్కువ సొమ్ము తీసుకోడానికి వీలుండదు. నేను సొమ్ముదగ్గర మహాకచ్చితంగా ఉంటానుసుమండి! ఏదీ! పానకాలుగారూ! ఆ సంచీ ఇటు తెండి, సొమ్ము లెక్కపెట్టనివ్వండి! (పానకాలు చేతిలోని ఖాళీ సంచీ లాక్కుంటాడు.) ఇదిగో, చిదానందంగారూ! ఈ చెక్కును మీరు ఎగాదిగా చూసి ఆసిడుపరీక్ష చేసుకోండి. (చెక్కు చిదానందంవద్దకు విసురుతాడు.)

విశ్వం: (సంచివిప్పి - ఖాళీసంచిని పానకాలుకుచూపి) మొత్తానికి యీముసలాయన నన్నే పిచ్చిపుల్లాయకింద కట్టేశాడు. (చిదానందంతో) ఇంత వయస్సొచ్చి ఏమిటీ చేతలూ? సిగ్గులేదటయ్యా!

(పరంజ్యోతి ప్రవేశం)

పరంజ్యోతి: (చిదానందంతో) ఈయనెవడు మామయ్యా? నిన్నలాగ దండిస్తున్నాడు? గడపదిగి వెంటనే పొమ్మనవేం?

చిదా: (కోపంతో) అన్ని విషయాలూ నీకే కావాలిరా?

పరం: నేనేం తప్పుపని చేశానా? అంత కసరుకొంటావు!

చిదా: (విశ్వంమీద వచ్చిన కోపమంతా పరంజ్యోతిమీద వలకపోస్తూ) చచ్చు వెధవా! అంట్ల గాడిదా! చచ్చులిపాయలు అమ్ముకోడానికయినా పనికిరావు. ప్రతిదానిలోనూ వేలెడతానంటావు. పో ఇక్కడినుంచి. పోతావా పోవా?

[పరంజ్యోతి నవ్వుకుంటూ పోతాడు]

పాన: (చిదానందం చెవిలో) మీరింత దగుల్బాజీగా ప్రవర్తిస్తారని కలలో అయినా అనుకోలేదండి. మీ మాటనమ్మి ఏమీ చూసుకోకుండా పదివేలకు చెక్కిచ్చిన పెద్దమనిషితో ఇట్లా వ్యవహరిస్తే ఏం చెప్పను? మీరు గుడినే మింగేవారని తెలిస్తే ఆ పెద్దమనిషిని ఇక్కడికి తీసుకొని రాకపోదును. ఈ సొమ్ముంతా బ్యాంకులో కట్టిన తరువాత, సొమ్ము బ్యాంకిలోంచి తీసే అధికారం మీకు ఇచ్చిన తర్వాత మీ సొమ్ము మీరు తెచ్చుకొని ఇనప్పెట్టిలో ఎందుకు పెట్టుకోకూడదు చెప్పండి?

చిదా: (పానకాలు చెవులో) డబ్బు తియ్యడానికి వాడి ఒప్పందం ఉండాలంటున్నాడు.

పాన: (విశ్వంతో) ఏమండోయ్! మీరదోలా అనుకున్నారుగాని, చిదానందంగారు మోతుబరులు, లకారానికి పడగెత్తారు. పొరపాటున ఒక సంచీకి ఒక సంచీ తేవడం మూలంగా యీ రసాభాసకు తావైంది. నిరుత్సాహం పొడసూపింది. అంతే!

చిదా: (పట్టలేని ఆనందంతో) పానకాలూ! నీవు కుర్రవాడివైనా సంగతులు ఇట్టే గ్రహించగలవోయ్! ఆ రెండో సంచీ పట్టుకొస్తున్నానుండు. (లోపలికివెళ్లి పదిలంగా ఉన్న సంచి పట్టుకొస్తాడు.)

విశ్వం: పానకాలుగారూ! ఆసంచి తీసుకోండి!

(పానకాలు చిదానందం యిచ్చినసంచీ తీసుకుంటాడు.)

పాన: చిదానందంగారూ! ఈడబ్బంతా మీ పేర బ్యాంకులో మీతరఫున నేను డిపాజిను కట్టేస్తా.

చిదా: రసీదు వెంటనే పట్టుకువచ్చి ఇయ్యవేం?

విశ్వం: ఏమండీ, పానకాలుగారూ! ఈయనకసలు మతిఉందా? డబ్బు తీసుకొన్నవాడు రసీదు ఎగవేస్తాడాండి?

పాన: కొంచెం చాదస్తంగాని, హృదయాం మంచిదేలెండి. (పానకాలూ, విశ్వం డాక్యుమెంటుకేసు తీసుకొని నిష్క్రమిస్తారు. చూపుమేరదాకా చిదానందం పిచ్చివాడిలా వెళ్లిపోతున్న వాళ్లకేసిచూస్తూ నిలబడిపోతాడు.)

## 3-వ రంగం.

చిదానందం పంచపాళీ.

చిదానందం రిజిస్టరు ఉత్తరాన్ని పట్టుకొని ఉన్మత్తునివలె ఇటు నటు తిరుగుతూ ఉంటాడు. చంద్రికలో పద్మంలా ముకుళించి ఉంటుంది అతని ముఖం.

చిదా: (స్వగతం) చూస్తో, చూస్తో ఊబిలో ఉరికాను. ఈ వెధవ రత్నం ఎవరో నాకు తెలీదు. ఫిల్ముకి అగ్రిమెంటు వ్రాసి పదిగంటలైందో లేదో అప్పుడే రిజిష్టరు ఉత్తరం. నా తరఫున గాంధోళిగాడు, పానకాలు తనతో చేసిన అగ్రిమెంటు ప్రకారం ఇంకా పది వేలు ముడతాయిట. ఉత్తరమందిన తక్షణం డబ్బు ముట్టచెప్పి రసీదు పుచ్చుకోపోతే కోర్టుద్వారా ఇంజక్షను ఇప్పించి అరెష్టు వారంటు పుట్టిస్తుందిట. ఓయి భగవంతుడా! ఎంత కష్టం వచ్చింది?

[పరంజోతి ప్రవేశం]

పరం: (చెక్కు మామమీద విసరికొట్టుతూ) దీనిమీద 'రిఫర్ టు డ్రాయర్' అని వ్రాసి తిరగకొట్టారు.

చిదా: దాని అర్థం కనుక్కురా వెంటనే.

పరం: కనుక్కున్నా. ఈ చెక్కు ఎవరో చచ్చిపోయిన వర్తకుడి బుక్కులోనిదిట. ఇది చూపించగానే బ్యాంకు గుమాస్తాలు అరగంట నన్ను చూసి విరగబడి నవ్వి ఎవడు టోపీ వేశాడయ్యా! అని మళ్ళీ కడుపు చెక్కలయ్యేట్టు నవ్వడం ప్రారంభించారు.

చిదా: అయ్యో! అయ్యో! నువ్వు వెంటనే వెళ్ళి పానకాలు ఎక్కడుంటే అక్కడ కలుసుకొని వాణ్ణి నిలబడ్డపడంగా లాక్కురా! పో!

[జోతి నిష్క్రమిస్తాడు. అంబరం ప్రవేశిస్తాడు. నత్తితో మాట్లాడుతాడు. వయస్సు పద్దెనిమిదేండ్లు. గూడకట్టు, చింపిరి జుట్టుతో ప్రత్యక్షమౌతాడు.]

అంబరం: మమమమ...(గుక్క తిరగదు. 'మ' ఉచ్ఛరించినపుడల్లా ఎడమ చెయ్యిని ఊతానికి వెనక్కు గిరవాటేస్తూంటాడు.)

చిదా: నువ్వు దాపరించావేమిటిరా?

అంబరం: అఅఅ...అది కాదండి. మామా మామా అమ్మకి అవసరంగా ఉందిటండీ!

చిదానందం: (కొట్టొస్తూ) అంత అవసరంగావుంటే మీ రిద్దరూ కట్టకట్టుకొని గంగలో ఉరకండి. బడితబాజావత్తు మంటావా? ఇక్కడనుండి పోతావా?

అంబ: (నాలుగడుగులు వెనక్కి వేసి బిక్క మొగంతో) మమమ .... మంగమ్మగారు పదిరూపాయిలు బదులు తీసుకున్నారండీ!

చిదా: చంపేస్తా, వస్తావా? రెండు వాయించమంటావా?

(అంబరం ఏడవడం ప్రారంభిస్తాడు. లోపలనుండి మంగమ్మ (ప్రవేశించి)

#  సినిమా పిచ్చి 

మంగ: (అంబరంతో) ఎందుకేడుస్తావు బాయనా?

చిదా: వీడు పదిరూపాయ లిమ్మంటున్నా డేమిటి?

మంగ: అందుకని కుర్రాణ్ని కొడతారుటండి? వాళ్ళవాళ్ళకి తెలిస్తే ఏమైనా ఉందా? వాళ్లసలే రౌడీలు. ఆడబ్బు యిచ్చేయండి.

చిదా: ఏడ్చినట్టే ఉంది నీసలహా. మళ్లీ మాట్లాడితే వాడి రొంతపీక్కి, నీ పీక నొక్కేస్తా.

(పరంజ్యోతి ప్రవేశం)

పరంజ్యోతి: పానకాలుపరారయిపోయాట్ట మామా! ఏమిటి? నాతో చెప్పలేదు. నువ్వేదో స్టుడియో పెట్టావుట? వేలకి వేలు కుమ్మరించేస్తున్నావుట?

చిదా: ఒరేయి ఆ పానకాలుగాడు, గాంధోళి నావద్దనుండి పదివేలు తీసుకొని వెళ్లాడురా.

పరం: పదివేలేమిటి? రత్నానికి ఇంకో పదివేలివ్వాలిట. 'గప్‌చిప్' లకు ఐదువేలివ్వాలిట. ఇంకా ఎవరికో తగులబెట్టాలిటగా?

చిదా: నీకిదంతా ఎల్లా తెలిసిందిరా?

పరం: ఊరంతా పాక్కిపోతే అలా వెర్రి మొహం వేస్తావేమిటి? అల్లా వేలకి వేలు వీళ్లకీ, వాళ్ళకీ ఫిల్ము తీయడానికి ఇవ్వకపోతే నాకిస్తే ఆ ఫిల్ము నేనే తీసెయ్యలేనూ? ఫిల్ము తీయటానికి ఎన్ని జన్మల నుంచి ఉబలాటపడుతున్నానోకదా!

చిదా: (మెల్లిగా) ఏమిటిరా పిచ్చి పెరిగిపోతున్నావు మరీని –

పరం: ఊరుకోవయ్యా - చెప్పావు. మాకు చిల్లిగవ్వ యివ్వడానికి కిందపెట్టవలసి ఉండేది. ఇరవై వేలు అప్పనంగా ధార పోశావు.

చిదా: ఎవరైనా నవ్విపోతారు, ఏమిటా అంకెలు?

పరం: నవ్వరుమరీ! చేసిందానికి? విలన్ పాత్ర వెయ్యడానికి బాగా పనికివస్తావు. చూశావా? అత్తయ్యా! ఈమామ! కృష్ణా, రామా అంటూ కూర్చోలేక బిళ్ళకుడుం లాంటి పదివేలరూపాయిలు బూడిదలో పోశాడు.

మంగ: ఓయి రామచంద్రా! (భర్తతో) ఇంత పోయేకాలం వచ్చిందేమండీ? డబ్బు అల్లా దుర్వ్యయం చేస్తే ఎల్లా బ్రతకడం?

చిదా: డబ్బు తగ్గింది కాబట్టి మన ఇంట్లో ఇకనుంచి ఒకపూట భోజనం, ఒకపూట మడత కుడుములు† వండుకుందాం.

మంగ: మీ డబ్బుతో పాటు మా ప్రాణాలుకూడా తీసేట్టున్నారు.

పరం: (మంగమ్మతో) సంగతి పూర్తిగా వినవేం? ఇంకో పదిహేను వేలు చేతి చమురు వదలకపోతే మామ బోనులో ఎక్కవలసి వస్తుంది. అటుపై శ్రీకృష్ణ జన్మస్థానం, పరువునష్టము.

మంగ: బాబాను! వీళ్ళందరికీ మీరు క్రితం జన్మలో ఋణపడి ఉన్నారు. ఈ అంబరానికో పదిరూపాయలు, పరంజ్యోతికో పదిహేను వేలు ఇచ్చేయండి. ఒరే పరంజ్యోతీ! ఎవరెవ్వరి కివ్వాలో వాళ్లందరికీ ఇచ్చేసి రసీదులు పట్టుకురా.

చిదా: నేను బతికుండగా అది జరుగదు.

పరం: నోరెత్తకు మామా! ఇంత అఘోరించావు. బయటకుపోతే నీ పరువుపోతుంది. నీమీద వాళ్లు సివిల్ క్రిమినల్ చర్య తీసుకుంటారుట—

మంగ: (నోరు కొట్టుకుంటూ భర్తతో) మీ జాప్యం తగలెయ్యా! త్వరగా వాడికి ఇనప్పెట్టె తాళా లిచ్చెయ్యండి. ఇంకా అలా చూస్తూ ఊరుకుంటారేం?

చిదా: ఐతే కానీ మరి. సరిగ్గా పదిహేను వేలే తీసుకో. (ఇనప్పెట్టె తాళం చెవి పరంజ్యోతి కిస్తాడు.)

మంగ: ఓ పదిరూపాయలు అదనంగా తీసి అంబరాని కివ్వరా!

పరం: నాకది వేరే చెప్పాలా అత్తయ్యా? (ప్రక్క గదిలోకి వెళ్ళి నెమ్మదిగా చిదానందానికి వినిపించకుండా ఉండేటట్లు) ఏమేవ్ లచ్చక్కా!

తెరలోంచి: బుద్ధిలేదుటండీ? మంచి మనిషిలో మాట, మంచిగొడ్డుకో దెబ్బ అన్నారు.

పరం: పోనీలే లచ్చక్కా అని పిలవనులే. పొరపాటుకు లెంపలు వాయించుకుంటున్నా. ఇటు చూడు.

తెరలోంచి: స్వర్ణలతా! అని నోరారా ముద్దుగా పిలవరేమండి ఎప్పుడూనూ?

పరం: ఇంక అల్లాగే పిలుస్తానుగా. సినిమా దేవుని దయవలన మామవద్ద నే నొక పదిహేను వేలు పడికొను. ఇవి తీసుకొని స్వేచ్ఛగా మద్రాసులో రెండేళ్లు వెలగబెట్టవచ్చు మనం. రోజూ రెండాటలూ నిర్భయంగా చూడొచ్చు. జీవితం ఎంత ఆనందమయంగా ఉంటుందనుకున్నావు? కాని మామ! పాపం, ఏమిటో అనుకున్నా. ఉత్తి మేకపోతు గాంభీర్యమే!

తెరలోంచి: డబ్బుకి మూడు ముళ్లు వేసే వాళ్లందరికీ అంతేనండి—

పరం: అంతే! అంతే!

(వెండి తెర పడుతుంది.)



† ఉపవాసం.

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## నిలువు కోడిగుడ్డు ఎందుకు చితకదు?

అని పెద్దవాల్తేరునుంచి వైరెడ్డి రాము గారు అడుగుతున్నారు.

కోడిగుడ్డును అడ్డముగాపెట్టి పెనసలు తోనో కాడతోనో కొట్టినప్పుడు ఆ గుల్లకి అడుక్కు వంచేటట్టు తగులుతుంది దెబ్బ. కనక సులువుగా కోడిగుడ్డు విరిగిపోతుంది. స్కూల్లో ఉపయోగించే సుద్దకణికని అడ్డముగా వంచి విరిచేయడము సులువుకదా? ఇప్పుడా సుద్దకణికనే టేబిలుమీద నిలువుగా నిలువబెట్టి పట్టుకుని నిలువుగా నొక్కి విరవడానికి యత్నించండి. ఒకపట్టాన విరగదు. ఎందువల్ల? కోడిగుడ్డును నిలువుగా నొక్కినప్పుడు విరగకపోవడమూ అందువల్లనే.

వస్తువులను నొక్కినప్పుడు వాటిలోని చిన్న చిన్న కణాలు మరింత దగ్గిర చేరతాయి. ఇలాగ చేర్చడానికి చాలా శక్తి కావాలి. కోడిగుడ్డుని నిలువుగా పెట్టి చేతితో నొక్కితే ఆశక్తి గుల్లయొక్క అణువులను కొంచెము దగ్గరగా చేర్చుతుంది. ఇలాగ నొక్కేశక్తిని పెంచుతూపోతే అణువులు క్రమంగా బాగా చేరికఅయి మరి చోటు చాలనప్పుడుకదా గుల్ల విరిగిపోగలదు! ఆస్థితిని తెచ్చేటంత శక్తి అరచేతితో ప్రయోగించడము కష్టము. చెయ్యి నొప్పిపెట్టేస్తుంది. కోడిగుడ్డుని నిలువుగాపెట్టి సుత్తితో కొట్టినట్లయితే విరిగిపోతుంది. ఏనుగు ఎడిచి పోయినా చితకదన్నది చూచి చెప్పినమాట కాదు. గోరంతె ఉన్నదానిని కొండంతలు చెప్పే అతిశయోక్తి.

కోడిగుడ్డు ఉదాహరణకి కొంచెం భిన్నమయినా ఇంచుమించు అలాటిదె మరొకటి చెప్తాను చూడండి. చీపురుపుల్లను అడ్డముగా వంచి విరచడము రెండువేళ్ళతో చేసేయవచ్చును. అయితే ఆ పుల్లను విరవకుండా చేతులతో లాగి తెంపేయండి చూతాము! చీపురుపుల్లచుట్టూ ఉండే సుమపుభాగము పేము జాతిది. వంగుతుందీ విరుగుతుందిగాని తెగదు. కోడిగుడ్డు ఉదాహరణలో నొక్కి శక్తిలాగే పేపకెత్తానికి లాగేశక్తి చాలా చాలా కావాలి.

సన్నని రాగి తీగను తెంపడము కష్టమని మీ రెరుగుదురు. కాని వంచడమూ విరవడమూ తేలిక. తెంపడానికి యత్నించేశక్తి, ఈ తీగలోని అణువులకు పరస్పరమూవుండే ఆకర్షణని - లేక చేరికని - అతిక్రమించ యత్నిస్తుంది. అణువుల ఆకర్షణశక్తి గొప్పది. దానిని అతిక్రమించడము కష్టము. ఒక మంచి ఉదాహరణ గమనించండి. పిచకారీగొట్టమునుంచి కడ్డీ తీసివేశారనుకోండి. కన్నము మూసివేశారనుకోండి. అంటే కన్నముపెట్టని ఎదురు




గొట్టము తీసుకున్నారన్నమాట. ఇప్పుడు ఆ గొట్టమునిండా నీరు పోశామనుకోండి. పిచకారీకడ్డీవున్నకే, దానివుండ - గుడ్డచుట్టినది - తీసేసి, రబ్బరు బిరడా, గొట్టములో సరిగాపట్టేది బిగించామనుకోండి. పటము చూడండి. 'బి' అన్నది బిరడా. 'క' అన్నది కడ్డీ. గొట్టమునిండా నీరె వుండాలి. గాలి బుడగలు ఉండరాదు. ఇప్పుడు కడ్డీని బయటికి లాగడానికి యత్నిస్తే ఒకపట్టాన రాదు. ఏమి జరుగుతోందన్నమాటా? నీటిని తెంపడానికి యత్నిస్తున్నాము. నీరు రాగితీగలాగ తెగకుండా నిరోధిస్తున్నది. పెద్ద బరువుని కడ్డీకి కట్టినట్లయితే తెగనేనా తెగుతుందిగాని కడ్డీని లోపలికి నొక్క యత్నిస్తే నీరు అణగదు. ఏనుగు ఎక్కినా సరే గ్లాసుడు నీటిని మాత్రం అంత చేయలేదు. కోడిగుడ్డుని నిలువుగా నొక్కితే గుల్లలోని అణువులు దగ్గిరగా నొక్కుతున్నామన్నమాట. అలాగ నొక్కి విరవడానికి చాలాశక్తి కావాలి.

సీరియల్

# ఉదయకిరణాలు

[illegible]

## 13

చిట్టిబాబు చనిపోయాడన్న వార్త పరంధామయ్యను చాలా కలవరపెట్టింది. అతను అల్లుకొంటున్న స్వార్థ ప్రణాళికలు అసలు జరిగేటట్లు కనిపించలేదు. చామంతిని చిట్టిబాబుకు యిచ్చి పెండ్లి చేద్దామనుకున్నాడు. రాధమ్మకు కూడా చామంతిని కోడలుగా చేసుకోవాలని కోర్కె ఉండడం వల్ల, పెళ్లి ఇట్టే జరగగలదని ఊహించాడు పరంధామయ్య. ఆ పెండ్లివల్ల తన అదుపులోకి అల్లుడి ద్వారా పదెకరాల భూమి వస్తుందని ఆశించాడు. చిట్టిబాబు చావుతో ఇవన్నీ అడియాసలైనాయి.

ప్రవంతి కూతుర్ని చిట్టిబాబుకు యిద్దామా వద్దా అని తర్జన భర్జనలో ఉండేది. మూడవ ఫారం దాకా చదువుకుని కొంత నాగరికత, రుచి మరిగి, అభ్యుదయ భావాలు కలిగిన ప్రవంతి పెండ్లి చేసుకునే వారి యిష్టాలను బట్టి తలితండ్రులు నడుచుకోవాలని వాదిస్తుంది. ప్రవంతి తండ్రి పెద్దవాడయినందున, ఏ ముహూర్తాన గుటుక్కుమంటాడో అని, మనుమరాలి పెండ్లి త్వరలో కావాలని అతను కోరిన ప్రకారం, చామంతికి యీ ఏడు తప్పక వివాహం చేద్దామని ప్రవంతి, పరంధామయ్యా నిశ్చయించుకున్న మాట వాస్తవం. రాధమ్మతో వీలైనప్పుడు పెండ్లి విషయం కదపవచ్చునుకుంటున్నారు. చిట్టిబాబుకి కూతురు నిచ్చి పెండ్లిచేయడమువల్ల ఉన్న ఆర్థికలాభాలు ప్రవంతికి బాగా నూరి చెప్పాడు పరంధామయ్య. కాని ప్రవంతి మాత్రం పూర్తిగా భర్తతో ఏకీభవించలేకపోయింది.

తల దువ్వుతూ, ఒకరోజు చామంతి అభిప్రాయం తెలుసుకుందామని ప్రయత్నించింది ప్రవంతి.

'ఈ ఏడు నీ పెళ్ళి చేసేస్తామేవ్' ప్రవంతి కూతురువైపు నవ్వుతూ సూటిగా చూసింది.

'నాకు పెళ్ళి అక్కర్లేదు ఇప్పుడప్పుడే' మూతి బుంగలా పెట్టింది చామంతి.

'మరి పెళ్ళి చేసుకోక ఏం చేస్తావు?"

'చదువుకుంటాను.'

'చదువుకుని ఊళ్లేలాలా, ఉద్యోగాలు చెయ్యాలా?'

చామంతి సమాధానమివ్వలేదు.

'నీకు చిట్టిబాబు ఇష్టమా? ప్రకాశం ఇష్టమా?' నవ్వుతూ చుబుకం చేత్తో పట్టి చామంతి తల ఎత్తింది.

చామంతి సిగ్గుతో తలవంచుకుంది.

'మరి సిగ్గుపడితే ఎలాగే!'

చామంతి పకపకా నవ్వింది.

'నిన్ను చిట్టిబాబుకు యిచ్చి పెళ్లి చేద్దామనుకుంటున్నాం. వాడికి, పదెకరాల భూమి, పెద్ద యిల్లు ఉన్నాయి.'

చామంతి కోపంతో మూతి ముడుచుకుని మౌనం వహించింది.

'ప్రకాశానికి ఆస్తిలేదు. డబ్బులేదు. ఏమీ లేదు.

'...........'

'నీకెవరు ఇష్టం చెప్పమరి.'

'...........'

'చిట్టిబాబు యిష్టమేనా?'

'...........'

'మరి ప్రకాశం అంటే ఇష్టమా?'

అవునంటూ చామంతి తల ఊపింది.

ప్రవంతి ఆశ్చర్యపడి ఒక్కసారి ఆలోచనలో పడింది. పూర్తిగా పరిస్థితులన్నీ తెలిసినా తెలియకపోయినా, పిల్లల యిష్టాలకు వ్యతిరేకంగా చేసిన పని చివరకు రాణించదని ప్రవంతి నమ్మకం.

'అయితే చిట్టిబాబు నీకు ఇష్టం లేదన్నమాట!'

'ఊహుఁ'

'మరి ప్రకాశం బాగున్నాడా?'

చామంతి నవ్వింది. చేతిలో ఉన్న రిబ్బను వేలికి చుట్టుకుంది.

'అయితే ప్రకాశాన్ని పెళ్ళి చేసుకుంటావా?'

'ఊఁ'

'మరి డబ్బులేనివాడు నీకు నగలు, చీరలు, ఏం యివ్వగలడే'

'నాకేమీ అక్కర్లేదు'

'మరి తిండైనా తినాలా?'

'ఎల్లాగోలాగ బ్రతుకుతాము'

ప్రవంతికి నవ్వు ఆగలేదు. కాని జాగ్రత్తగా బిగపట్టుకుంది.

జడవేయడం పూర్తిచేసింది ప్రవంతి. 'వెళ్లి నీళ్లుపోసుకో' అని కూతుర్ని పంపేసింది. చిన్నప్పుడు తన తల్లి కూడా కన్న ఒక పెండ్లికొడుకు విషయంలో ప్రశ్నలు వేస్తే యిలాగే సమాధానం చెప్పింది. అప్పుడు తల్లి కుదర్చబోయే ఆ సంబంధం తిరగకొట్టేసింది.

భర్తకు ఈ సంభాషణ అంతా చెప్పింది ప్రవంతి. 'చిన్నపిల్ల! దానికేం తెలుసు నే!' అని తేలిగ్గా తోసేశాడు పరంధామయ్య ఆమె అభిప్రాయం. కాని ప్రవంతి అటు కూతురు ఇష్టం కాదనలేక, ఇటు భర్త అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవించలేక సందిగ్ధావస్థలో పడి, పెండ్లిమాటలు జరగనీయకుండా కాలయాపనం చేసింది.

ఇంతలో చిట్టిబాబు చనిపోయాడన్న వార్త వచ్చింది.

'మాకారా! పెండ్లి నిశ్చయించకుండా ఉండడం చాలా మెరుగైంది' ప్రవంతి పరంధామయ్యవైపు చూసింది. భార్య మాటతో పూర్తిగా ఏకీభవించాడు పరంధామయ్య. అయినా ఒక్క విషయం మాత్రం ఖచ్చితంగా చెప్పేశాడు. 'ఆస్తిలేని ఆ అనాథుడికి మాత్రం పిల్లనివ్వను' అని.

'మరో నాలుగేండ్లదాకా పిల్ల పెండ్లి చెయ్యదల్చుకోలేదు. ఈ లోపుగా బాగా చదువుకోనీ. వీలైతే మంచి సంబంధాలు కూడా వెతకవచ్చు. మీ నాన్న మంచమెక్కాడని ఎవరో ఒకరికిచ్చి ముడి పెట్టెయ్యలేం' అని కసిరాడు పరంధామయ్య.

చిట్టిబాబు మరణవార్త తెలిశాక చేతిలో ఉన్న అర్జంటుఆఫీసు పనులు కొన్ని ముగించుకుని, సెలవుతీసుకుని వెళ్ళి రాధమ్మను పరామర్శిద్దామనుకున్నాడు పరంధామయ్య. ఇంతలోనే అవధాని రాధమ్మను విజయనగరం తీసుకువెళ్ళాడని తెలిసి, అంతదూరము వెళ్ళే ఓపిక, తీరిక కూడా లేక, కుర్రాడి మరణానికి తన సంతాపం తెలియజేస్తూ రాధమ్మకు ఒక ఉత్తరం వ్రాసి ఊరుకున్నాడు.

## 14

ప్రకాశం కాలేజీ హాస్టలులో చేరి రెండు నెలలయింది. ఒక గదిలో మరో ముగ్గురు విద్యార్థులతో బాటు తనకు కూడా ఒక మంచం, టేబిలు, మొదలైనవి సరఫరా చేశారు. సంసారబాధ్యతలు లేకుండా వేళకు భోజనం, చదువుకునే అవకాశాలు అందుబాటులో ఉన్నాయని ఒకవైపు ప్రకాశా

నిక సంతోషంగానే ఉంది. కాని తనతో ఆడుకుంటూ, చదువుకుంటూ, నిత్యం తోడుగా ఉండే చిట్టిబాబు లేకపోవడం ప్రకాశానికి తీరనివ్యథ కలుగచేస్తోంది. హాస్టలులో ఎంతోమంది స్నేహితులున్నా ఎవరితోనూ ఎక్కువగా పరిచయం పెట్టుకోలేకపోయాడు. సాయంత్రం ఆటలు మాని, ఒంటరిగా ఏ పార్కుకోపోయి కూర్చునేవాడు.

హాస్టలులో తీరిగ్గా ఉన్నప్పుడు చదువుకుందామని పుస్తకాలు తెరిచేవాడు ప్రకాశం. ఆగదిలో ఉన్న విద్యార్థులు ప్రకాశం వింత ప్రవర్తన చూసి వెక్కిరించేవారు.

'మాషంపెర్రా! పుస్తకాలు తినే చెదపురుగు - కాలేజీ తెరచి మూడు నెలలు కాలేదు - అప్పుడే పుస్తకాలు నమిలెయ్యాలి'

వాళ్ల హేళనలకు కోపం తెచ్చుకుంటే అందరూ కలిసి యింకా హేళన చెయ్యగలరని ప్రకాశం వాళ్ల మాటలు విని నవ్వి పుస్తకాలు మూసేసేవాడు. ఒక విద్యార్థి సినిమా పాట మొదలెట్టేవాడు. మరొకడు టేబిలు మీద మద్దెల వాయించేవాడు. మరొక విద్యార్థి రాత్రిళ్లు ఉపయోగించే చారల లాగూ చొక్కా తొడుక్కొని భరత నాట్యం చేసేవాడు. ఆ విధంగా లలిత కళలను ఆరాధిస్తూ, యిష్టమొచ్చినంత అల్లరి చేస్తూ, సాయంత్రమవగానే ముస్తాబుచేసుకుని సినిమాలకు పోయేవారు. రాత్రి వాళ్లు లేని సమయాల్లో పుస్తకాలు తెరిచి, ఒక గంట చదివేటప్పటికి, కేకలు పెట్టుకుంటూ గంతులు వేస్తూ మళ్ళీ విద్యార్థులు గదిలో ప్రవేశించేవారు.

ఈ పద్ధతిలో తన చదువు సాగేలా కనిపించలేదు ప్రకాశానికి. మరొకచోట ఎక్కడైనా గది అద్దెకు తీసుకుందామంటే, ఖర్చు ఎక్కువౌతుంది. ఇప్పటికే ప్రతి నెలా అవధాని పంపిస్తున్న ఏభైరూపాయిలు తనకు సరిగా చాలటం లేదు. ఏ ముఖం పెట్టుకుని మామయ్యను ఎక్కువ డబ్బు అడగగలను! అని ఊరుకున్నాడు ప్రకాశం.

చిట్టిబాబు మరణంతో జీవితంలో ఏదో పెన్నిధి పోగొట్టుకున్న వాడిలా, ఆటలుమాని, ఉత్సాహం లేక, చదువుకుందుకు సరియైన అవకాశాలు లేక, ఏదో ఆలోచిస్తూ ప్రతి రోజూ చాలాసేపు ఏకాంతంగా కాలం గడుపుతున్నాడు ప్రకాశం.

కాలేజీ హాస్టలులో రెండు నెలలు గడవగానే, అవధాని వద్దనుంచి ఒక ఉత్తరం వచ్చింది.

'ప్రియమైన ప్రకాశానికి'

నాకు బెంగుళూరు బదిలీ అయింది. రాధమ్మను, మీ అమ్మను, పిల్లలను తీసుకుని వచ్చే మంగళవారం రైల్లో వస్తున్నాను. రాధమ్మ యిల్లు శుభ్రం చేయించి ఉంచవలసింది. బహుశా మీ అమ్మ, అందరూ ఇక ముందు కాకినాడలోనే వుంటారు. తక్కిన సంగతులు నే వచ్చాక మాట్లాడుతాను.

ఇట్లు,
ఆశీర్వాదాలతో
అవధాని.

అవధాని ఉత్తరం చూసి హాస్టలు బ్రతుకు ఇంతటితో అంతమౌతుందని, సంతోషించాడు ప్రకాశం. కాని మరుక్షణంలోనే మరొక ఆలోచనతట్టింది. అవధానిమామయ్య ఒంటరిగా బెంగుళూరులో ఉంటాడా? భోజనం? రెండు నెలలు హాస్టలు భోజనం తిని, బాగులేదని తనే చిరాకు పడ్డాడు. అటువంటిది మామయ్య ఎంతకాలం హోటల్లో భోంచేస్తూ ఉండెడం?

అవధాని సోమయాజులుకు కూడా ఉత్తరం వ్రాశాడు. రాధమ్మ యిల్లు శుభ్రం చేయిద్దామని ప్రకాశం వెళ్ళిన సమయానికే సోమయాజులు కూడా అక్కడికి వచ్చాడు.

రాధమ్మ యింట్లో ఆమె విధవాడపడుచులు యిద్దరు కాపురం ఉంటున్నారు; వెంకమ్మ, పుల్లమ్మ. రాధమ్మ భర్త దత్తుపోవడం వల్ల ఆయనకు పదెకరాల ఆస్తి, పెద్ద యిల్లు సంక్రమించాయి. ఆయనకు స్వయాన చెల్లెళ్లైన వెంకమ్మ, పుల్లమ్మ ఆస్తిలేక, మనువర్తిఆధారంకూడాలేక, అనాథలైపోయారు. రాధమ్మ భర్త తన చెల్లెళ్ళ కష్టాలు చూసి జాలితో తన విల్లులో వ్రాశాడు - ఒకవేళ తను చనిపోతే, ఆస్తిమీద వచ్చే శిస్తులలో ఇద్దరికీ చెరొక మూడు వందలు భార్య యివ్వాలి. వాళ్లు బ్రతికి ఉన్నంతకాలం తన ఇంట్లోనే కాపురం ఉండనివ్వాలి — అని. ఆ ప్రకారం రాధమ్మ యింట్లో ఇద్దరూ చెరొకగది తీసుకుని కాలంగడుపుతున్నారు. తమకు వచ్చే మూడువందల రూపాయిలతో రాధమ్మ మీద ఆధారపడకుండా, ఆమెతో కష్టాలకు సుఖాలకు కూడా అడుక్కోకుండా, యింట్లో ఉన్నా లేనట్లే విచిత్రంగా మసలడం వాళ్లకి అలవాటైపోయింది. రాధమ్మ కూడా ఏటేటా డబ్బు యివ్వడం తప్ప, మరో విధంగా వాళ్ళ విషయాల్లో జోక్యం కలుగచేసుకునేది కాదు. భర్త ఉన్న రోజుల్లోనే వాళ్లితో రాధమ్మకు సరిపడేది కాదు.

రాధమ్మ విజయనగరం వెళ్ళేముందు తన సామానంతా ఒక గదిలో పడేసుకుని, తక్కిన యిల్లంతా ఆడపడుచులకు అప్పచెప్పింది.

ఆమె తిరిగి వస్తుందనగానే ఆ భాగం మళ్ళీ అప్పగించడం వెంకమ్మకు పుల్లమ్మకు ఇష్టం లేదు. అసలు ఈ రెండు నెలలు రాధమ్మ యిచ్చిన యింటిభాగం వాళ్ళు వాడుకోనే లేదు. రాధమ్మ నివసించే భాగమంతా దుమ్ము, ధూళి, బూజులు నిండి

పాత యిల్లులా తయారయింది. ఆ బూజులు దులిపే కష్టం తమ కెందుకని నిర్లక్ష్యంగా ఊరుకున్నారు ఆడపడుచులు.

ఒకేసారి గుమ్మంముందు తటస్థపడి, ఒకరి వైపు ఒకరు చూస్తూన్న ప్రకాశం సోమయాజులు వైపుచూసి ఆడబడుచులు గుమ్మంలోనే ఆశ్చర్యంగా ఆహ్వానించకుండా నిలుచుండి పోయారు.

ప్రకాశం మాట్లాడడం ఇష్టంలేక సోమయాజులు వైపుచూసి ఊరుకున్నాడు.

'మీ మామయ్యకు బదిలీ అయిందిట'

'అవును'



'రాధమ్మ రేపు వస్తుందిట'

'అవును'

'ఇల్లు శుభ్రం చేయించాలిట'

'అవును'

'నువ్వు శుభ్రం చేయిస్తావా?'

'ఊ'

సోమయాజులు వెళ్ళిపోయాడు, ప్రకాశం మామూలుగా మాట్లాడడం లేదని.

ప్రక్క యింటి దాసీ దాన్ని పిలిపించి, యిల్లు శుభ్రం చేయించి వెళ్ళిపోయాడు ప్రకాశం.

మర్నాడు మాణిక్యం, రాధమ్మ, అవధాని, సాంబు, శాంత, అంతా వచ్చేరు. రాధమ్మ యీ రెండు నెలల్లో చిక్కి శల్యమై పోయింది. కళ్ళు బాగా లోతుకు దించుకు పోయాయి. దవడలు నొక్కుకుపోయాయి. పళ్ళు పైకి పొడుచుకు వస్తున్నట్లున్నాయి.

'అమ్మా దొడ్డమ్మ చాలా చిక్కిపోయిందేమే' అన్నాడు ప్రకాశం.

మాణిక్యం ఒక్క నిట్టూర్పు విడిచింది.

'ఏముంది నాయనా జెంగ.'

రాధమ్మను ఈ రీతిగా వదిలేస్తే బ్రతుకుతుందా లేదా అని అనుమానపడ్డాడు ప్రకాశం.

అవధాని బెంగుళూరులో తను ఒక్కడూ ఉంటానని తన నిశ్చయం చెప్పేశాడు మాణిక్యానికి. ఒంటరిగా ఉన్న రాధమ్మను తన దగ్గర ఉంచుకుందామన్నా, ఆమె ఆరోగ్యం యింకా పాడైపోతుందని, ఆమెను మాణిక్యం సంరక్షణలో వదిలేస్తే మంచిదనుకున్నాడు. హోటలు భోజనంవల్ల తన ఆరోగ్యం పాడౌతుందని తెలిసినా అవధాని, ప్రకాశాన్ని చాలాకాలం హాస్టలులో ఉంచడం ఇష్టపడలేదు. పైగా తల్లితో ఉంటే, ప్రకాశానికి భోజనం చదువుకూడ సదుపాయంగా కుదరగలవనుకున్నాడు. బెంగుళూరు చాలదూరం. రాధమ్మ ఆదుకునే బంధువులందరికీ దూరమౌతుంది.

అదీకాక బెంగుళూరులాంటి పెద్ద పట్నములో సంసారం పెడితే ఎంత సొమ్మైనా చాలదు. ఒంటరిగా ఉంటే తాను కూడబెట్టగలిగే సొమ్ముతో కాకినాడలో ఒక కుటుంబాన్ని పోషించవచ్చును. ఇవన్నీ మనస్సులో పెట్టుకుని బెంగుళూరు తాను ఒక్కడే వెడతానని తీర్మానించుకున్నాడు అవధాని.

మాణిక్యాన్ని పిల్లలతో, తన యింట్లోనే ఉండమంది రాధమ్మ. రాధమ్మకు, మాణిక్యం సహాయకారి అవుతుందనే కాక, అద్దె కొంత తగ్గినా, ఖర్చు తగ్గినట్లేనని అవధాని సంతోషించాడు. రాధమ్మ యింతకాలం తన కొడుకును దగ్గర పెట్టుకుని పోషించిన ఋణం యీ కష్ట సమయంలో తను తీర్చుకోగలనని మాణిక్యం సంతోషించింది. చిట్టిబాబు లేని లోటువల్ల రాధమ్మ బాధ పడకుండా తాను సేవచెయ్యడానికి తిరిగి అవ

కాశం లభించిందని ప్రకాశం సంతోషించాడు. అవధాని బెంగుళూరు వెళ్లిపోయాడు.

## 15

వెంకటప్పయ్య చెప్పిన జ్యోతిష రహస్యం ఒక స్వరూపం దాల్చలేదేమో అనే సందేహం కొందరు బంధుజనానికి కలిగింది. రెండు సంవత్సరాలు గడిచిపోవడం వల్ల, ఆయన చెప్పిన జోతిష రహస్యం విలువపోయి, ఇది వట్టి అబద్ధమని కొంద రనుకున్నారు. పరిసర వాతావరణంలో తన పరపతి తగ్గుతూందని గమనించిన వెంకటప్పయ్య ఒక ఎత్తువేశాడు. రాధమ్మ ఊళ్లోకి వచ్చిందని తెలిసి ఆమెను ఒకసారి చూసివద్దామని బయలు దేరాడు.

మునుపటి రాధమ్మకు, యిప్పటి రాధమ్మకు సహస్రాంతం తేడా కనిపిస్తోంది. ఆమెకు యుక్తాయుక్త విచక్షణ జ్ఞానం నశించింది. ఎవరు కనిపించినా తన చనిపోయిన కొడుకు గురించి వార్త తెచ్చినట్లు విచిత్ర సంభాషణ మొదలు పెడుతుంది. రోజూ కొడుకు తన కలలో కనిపించి త్వరలో ఇంటికి వస్తానంటూ చెపుతున్నాడని, ఎవరో దేవత కనిపించి 'నీ కొడుకు నాదగ్గర భద్రంగా ఉన్నాడు, త్వరలో పంపిస్తా' నందని, యివి తప్పకుండా యథార్థాలు అవుతాయని తమాషాగా మాట్లాడుతోంది. రాధమ్మను చూసిన ప్రతీవాడు ఆమె మనస్సు చెడిందని నిర్ధారణ చేసుకునే పరిస్థితి వచ్చింది.

'నే ననుకుంటూనే వున్నాను, మీరు వస్తారని' నవ్వింది రాధమ్మ.

వెంకటప్పయ్య చేటంత ముఖం చేసుకున్నాడు. చిట్టిబాబు చనిపోయిన రోజుల్లో వచ్చి చూడనందుకు మరో విధంగా అనుకోకుండా స్వాగతమిస్తున్న రాధమ్మ చాలా మంచి మనిషని అనుకున్నాడు వెంకటప్పయ్య.

'మీకింత కష్టం వస్తుందనుకోలేదు' వెంకటప్పయ్య విచారం వెలిబుచ్చేడు.

కొడుకు చనిపోవడం మళ్ళీ మనస్సులో మెదిలింది రాధమ్మకు. తీవ్రమైన ఆలోచనలు ఏవో పరుగిడుతున్నాయి ఆమెతలలో.

రాధమ్మ మౌనంతో తల వంచుకుని ఏడ్చింది.

'విచారించకండి ఎవరి ఖర్మ ఎలాగుంటుందో ఏం చెప్పగలం? అంతా ఋణానుబంధం!' ఏమనాలో తెలియక తికమకలో పడి, నోటికి వచ్చింది వాగేశాడు వెంకటప్పయ్య.

'మీరు చాలా దొడ్డవారండి!' రాధమ్మ ముఖంలో కోపం కనుపించింది వెంకటప్పయ్యకు. 'మీరు ఆరోజు కుర్రాళ్ల జాతకాలు చూసినప్పుడు, మా వాడు చనిపోతాడని కూడా చెప్పలేకపోయారే! పైగా ప్రకాశం చచ్చిపోతాడన్నారు. యిన్నాళ్లు చేయించిన శివాభిషేకాలు మావాడి పేర చేయిస్తే బ్రతికేవాడేమో' మళ్ళీ కన్నీరు పెట్టుకుంది రాధమ్మ.

ఎవరైనా ఈ మాటలు విన్నారేమో అని చుట్టుపక్కల చూశాడు వెంకటప్పయ్య. ఆ గదిలో తామిద్దరేతప్ప మరొకరులేరని స్థిమిత పడ్డాడు.

అసలు వెంకటప్పయ్యకు చిట్టిబాబు జాతకం చూడగానే త్వరలో మారకముందని తెలిసింది. అది రాధమ్మకు చెబితే బెంగ పెట్టుకోగలదని చెప్పడం మానేశాడు. అది ప్రకాశం మీదకు త్రిప్పేశాడు వెంకటప్పయ్య. యిది రహస్యమంటూ రాధమ్మతో అప్పుడు చెప్పాడు.

రాధమ్మ అన్నమాటలకు తన్ను సమర్థించుకుంటూ సమాధానం చెప్పాలను కున్నాడు అతను.

'చూడండీ! నా మాటల్లో ఏ మాత్రం అబద్ధం లేదు. చిట్టిబాబు, ప్రకాశం చాలా కలిసి మెలిసి తిరిగేవారు. అబ్బాయికి మారకం ఉందని మీరు విన్నాక అనేక శివాభిషేకాలు చేయించారు. అందువల్ల ప్రకాశం గుప్తగ్రహాలు అతిన్ని విడిచి, అతని ప్రక్కనే మసలు తున్న మీ కొడుకును ఆవేశించి ఉంటాయి. చాలా చాకచక్యంతో మాట్లాడే ననుకున్నాడు వెంకటప్పయ్య.

రాధమ్మకు మరీ కోపం వచ్చింది.

'మీరు పెద్దవారు ఇంత నీచంగా మాట్లాడుతారని అనుకోలేదండీ' పకపకా నవ్వేసింది రాధమ్మ. ప్రకాశంమీద అభిమానంవల్ల, ఎవరి ఖర్మ వాళ్ళదే అనే నమ్మకంవల్ల, వెంకటప్పయ్య మాటలు నమ్మలేక పోయింది రాధమ్మ.

కోపం చూపించిన రాధమ్మ, సమాధానం చెప్పి, ఫక్కున నవ్వగానే, వెంకటప్పయ్యకు ఆమె మనస్సు స్థిమితం తప్పిందని అనుమానం తట్టకపోలేదు. అంతటితో, రాధమ్మవద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు వెంకటప్పయ్య.

రాధమ్మ బ్రతుకు పద్ధతి దినదినం మారిపోతూంది. చిట్టిబాబు ఈడు కుర్రాళ్లు ఎవరు కనిపించినా, మాట్లాడుతూ గొల్లుమని ఏడ్చేసేది. అందరూ విస్తుపోయేవారు. 'అది కాదే. వీడిని చూస్తుంటే చిట్టిబాబు జ్ఞాపకం వస్తున్నాడు' అనేది. వీలైనంత వరకూ ఎవరితో మాట్లాడకుండా ఒక్కర్తీ తన గదిలో తలుపులు కిటికీలు మూసుకుని పడుకుని ఏడుస్తూ గడుపుతోంది. మాణిక్యం ఎన్నోసార్లు 'అలా ఏడవకే!! కళ్ళకు రోగంకూడా వస్తుంది' అని అనునయించేది. 'కొడుకు లేనిది బ్రతికినా చచ్చినా ఒకటే. నన్నేనా తీసుకువెళ్లాడు కాదు దేవుడు!!' అంటూ గొల్లుమనేది రాధమ్మ. అన్నం తినడం బాగా తగ్గించేసింది. పైగా ఒంటి పూట భోజనమే చేస్తూ రాత్రుళ్లు కాస్త మజ్జిగ త్రాగి ఊరుకుంటోంది. ఎవరు ఎన్ని విధాల చెప్పినా, రాధమ్మ వినదు. 'ఏడవకూడదని' ఎవరైనా జాలిగా చెపితే, కొడుకును తల్చుకుని గొల్లుమని ఏడ్చేది.

రోజురోజుకూ చిక్కిపోతున్న రాధమ్మ పరిస్థితి చూసి, డాక్టరుదగ్గర మందు యిప్పిద్దామని అన్నపూర్ణయ్యగారిని పిలిపించింది మాణిక్యం.

'నాకు ఏ రోగం లేదు. నాకు డాక్టరెందుకు' అంది రాధమ్మ.

అన్నపూర్ణయ్యగారు కూడా అదే అన్నాడు. 'మనోవ్యాధికి మందులేదు'ని.

'ఈ మనోవ్యాధివల్ల ఆరోగ్యం చెడిపోకుండా మందేదైనా యివ్వండి' అంది మాణిక్యం.

'ఇవ్వడానికి అభ్యంతరం లేదు. కాని, అటువంటి మందులు ఇటువంటి మనోవ్యాధులు ఉన్నప్పుడు పట్టవ్వవు' అన్నారు డాక్టరు అన్నపూర్ణయ్యగారు.

'బాగా చెప్పారు' అంది రాధమ్మ నవ్వుతూ.

ఒక్కొక్కసారి ఏడుస్తుంది రాధమ్మ. మరొకసారి తనలో తాను నవ్వుకుంటుంది. సణుగుకొంటూ తిట్టుకుంటుంది. 'కడుపులో మంటర్రోయి' అంటూ కేకలేస్తుంది. 'కళ్ళు పీక్కుపోతున్నాయర్రోయి' అని మూల్గుతుంది. అర్థరాత్రి మంచంమీదనుంచి గబుక్కున కేక పెట్టి లేచి, 'చిట్టిబాబు కనిపించేడే! రెండు రోజుల్లో యింటికి వస్తాడు.' అనేది, ఒకో పర్యాయం అర్ధరాత్రి దీపం పుచ్చుకుని గదులన్నీ వెదికివచ్చేది. 'ఏమిటే' అని మాణిక్యం అడిగితే 'ఆ ప్రక్క గదిలో చిట్టిబాబుపడుకున్నట్టుకనిపించాడే' అనేది. ఈ వింత ప్రవర్తన చూసి మాణిక్యం తన

# ★ ఉదయ కిరణాలు ★

అప్పగారి ముందు బ్రతుకు ఎలా ఉంటుందా అని పరిపరి విధాల వాపోయేది.

రోజులు గడుస్తూంటే పురాణాలు హరికథలు బాగా వింటున్న రాధమ్మకు ఒక వింత ఆలోచన తట్టింది. పూజలు వ్రతాలు సంతర్పణలు చేస్తే, చనిపోయిన కొడుకు బ్రతికివస్తాడనే భావం ఆమెను బాగా పట్టుకుంది. ఒక్కొక్క రోజు పదిమంది బ్రాహ్మలను పిలిచి భోజనాలు పెట్టేది. ఏ దేవుడో, దేవతో, పటాలు ఎదురుగా పెట్టుకుని పూజలు చేసేది. హఠాత్తుగా ప్రకాశాన్ని పిల్చి తక్షణం ఒక వంద బత్తాయిలు తెమ్మని మర్నాడు అందరికీ పంచిపెట్టేది. వత్తులు తీసి, పెద్ద పెద్ద దీపాలుచేసి, 'ఈ దీపాలు, ఈఅర్ధరాత్రి ఎంత బాగున్నాయో' అని పట్టపగలే మాట్లాడేది. అన్నిరకాల పళ్లు, పిండివంటలు, పువ్వులు, ఒక వ్రతంలా, ఏదో రోజు, అందరికీ పంచిపెట్టేది. ఈ పరిస్థితులు చూసి రాధమ్మకు పూర్తిగా మతి చెడిందని అందరూ అనుకున్నారు.

ప్రకాశానికి యింట్లో పరిస్థితులన్నీ అల్లకల్లోలంగా మారి, అతని చదువు పాడవుతోంది. రాధమ్మ తన పూజా పునస్కారాలకు కావలసిన సరుకులు తెమ్మంటూ ఒక వేళా పాళా లేకుండా ప్రకాశాన్ని బయటకు పంపించేది. దానితోపాటు నిత్యం సంసారానికి కావలసిన కూరలు, దినుసులు, తమ్ముడికి చెల్లెలుకు కావలసిన బట్టలు తేవడం, స్కూలు పుస్తకాలు కొనడం, జీతాలు కట్టడం, మొదలైన బాధ్యతలన్నీ అతడి నెత్తిన పడ్డాయి. మాణిక్యం సహజంగా మెత్తని మనిషే కాక, సంసారం దిద్దుకోడంలోనూ మెత్తదస్తురాలే. అందువల్ల ఆమె కావలసిన వస్తువులు అన్నీ ఒకేసారి ఆలోచించుకోక, ప్రతీరోజు ఏవో వస్తువులు ముఖ్యావసరమని బజారుకు పంపేది. ప్రకాశం చదువుకు సరియైన సమయం దొరక్క చికాకు పడేవాడు. కాని పనులన్నీ మాత్రం తప్పనిసరిగా చెయ్యవలసి వచ్చేది.




సంసార బాధ్యతలతోపాటు, తమ్ముడు చెల్లెలు బాగా చదువుకోవాలనే ప్రకాశం ఆసక్తి. రాత్రి తమ్ముడు చెల్లెలు ఎల్లా చదువుతున్నారో అని ఏవేవో ప్రశ్నలు వేసి పరీక్ష చేసేవాడు. స్వతస్సిద్ధంగా చదువులో చురుకు లేని సాంబు రోజూ ప్రకాశంచేత దెబ్బలూ సొంటి పిక్కలూ తినవలసి వచ్చేది. ఆడవాళ్ళ చదువులు ఎప్పుడూ నానా కాలపు చదువులే అనే అభిప్రాయంతో కాంతసరిగా చదివినా లేకపోయినా ఒకసారి కూకలేసి, ఊరుకునేవాడు. ప్రకాశం యింటి పెద్దగా చూపించే చికాకు, అజమాయిషీ చూసి, సాంబు, కాంత, అన్నగారంటే హడలిపోతుండేవారు. ఎదుగుతూ, ప్రపంచజ్ఞానం తెలుసుకుంటూ యింటి పెద్దగా మసలుతున్న ప్రకాశం మాటలు, సలహాలు, కోపం ఒదుగుతూ వినేది మాణిక్యం. రాధమ్మ విచిత్ర ప్రవర్తనకు లోలోపల బాధపడుతున్నా, ఆమె ఆస్తి శిస్తులవల్లా, అవధాని పంపే సొమ్ముతోటే, సంసారం మాత్రం, పరుల మీద ఆధారపడకుండా సుఖంగానే కాలం గడుపుతూ వచ్చేరు మాణిక్యం. ప్రకాశం.

మరో రెండు నెలలు గడిచాయి.

రాధమ్మ మనస్తత్వం మారేటట్లు కనిపించలేదు. పైగా చిట్టిబాబు గురించి నిత్యమూ కలవరిస్తోంది. కలలు నిజంకాక, వ్రతాలు, సంతర్పణలవల్ల ఏ ఫలితం లేకపోగా, చిట్టిబాబు యింక కనిపించడనే నిరాశ ఆమెను ఆవరించింది. చిట్టిబాబు చనిపోడానికి రామలింగశర్మ ఒక్కడే కారకుడు కాడని, ప్రకాశంకూడా బాధ్యుడనీ, వెంకటప్పయ్య మునుపు అన్నమాటల ప్రభావం ఊరికేపోలేదు. ప్రకాశం కనిపిస్తే, మునుపు చాలా ఆదరణ చూపించే రాధమ్మ, యిప్పుడు విసుగు, కోపం, చిరాకు, చూపిస్తోంది. ఎందుకైనా ఎదురొతే, పొమ్మని పెద్ద కేకలు పెట్టి ఏడుస్తోంది. 'నా కొడుకును చంపి మీరంతా బ్రతుకుతున్నారర్రోయి' అని ప్రకాశాన్ని చూడగానే ఏడ్చేది. 'నా డబ్బంతా మింగుతున్నారర్రోయి' అని మాణిక్యంపై కసిరేది. 'నా ఆస్తిపడి తిందామని నా కొడుకును చంపేశారా' అని కనిపించిన ప్రతీ మనిషిని ప్రశ్నించేది. రాధమ్మకి మతి చెడుతున్నదని విచారిస్తున్న మాణిక్యం, ప్రకాశం, ఆమె మాటలుమాత్రం లెక్కచెయ్యటం లేదు.

కాని రాధమ్మ దినదినం రెచ్చిపోసాగింది. అన్నంపెడితే కోపంతో మాణిక్యంపై విసిరేది. ప్రకాశం కనిపిస్తే, 'నిన్ను చంపేస్తా వెధవా! నాకంటికి కనిపించకు' అని అరిచేది. 'నా యింట్లోంచి పొండ్రా మీరంతా' అని ఒకరోజు ప్రకాశం సామాన్లన్నీ బయటకు విసిరేసింది రాధమ్మ.

ఒకసారి పురంధామయ్య వచ్చి, రాధమ్మ పరిస్థితిచూసి, వీలైనంత జాలి కనపరిచి, ఏం చేద్దామా అంటూ నిష్క్రమించాడు. సుబ్బమ్మ మాత్రం ఆనందంతో ఉబ్బిపోయింది-ప్రకాశానికి ఉన్న ఒక్క శ్రేయోభిలాషి పాడైపోయిందని. అప్పగారికి మతి చెడిందని సీతమ్మకు సహజమైన పేగు బాధవున్నా, తనకొడుకు రామలింగశర్మ కనిపిస్తే ఆమె తిట్టి, కొట్టినంత రభస చేస్తూండడం వల్ల, రాధమ్మ జోలికి ఏవిధంగానూ పోడం మానేసింది. భార్య హద్దుల్లో, ఆ వతుల్లో. సోమయాజులు అలవాటు ప్రకారం నడుచుకుంటున్నాడు. వెంకమ్మ, పుల్లమ్మ, తమ ఏకాంతం వదలక, తమకేమీ సంబంధంలేనట్లు, రాధమ్మ వైపు గుడ్లు అప్పగించి చూస్తూ కూర్చునేవారు. ఇరుగుపొరుగు పెద్దలు, అమ్మలక్కలు, చేతనైనట్లు సానుభూతి చూపిస్తున్నారు. అందరూ దూరదూరంగా ఉండడంచూసి, మాణిక్యానికి రాధమ్మ స్థితిగురించి బెంగ ఎక్కువై, అవధానికి ఉత్తరం వ్రాసింది, ఒకసారి సెలవు చేసుకుని కాకినాడ రమ్మని.

ఒకరోజు ప్రకాశం, సాంబు, స్కూళ్లు విడిచి యింటికి రాగానే రాధమ్మ ఇంట్లో చిందులు త్రొక్కుతూ, ప్రళయ తాండవం చేస్తూంది. మాణిక్యానికి, పిల్లలకీ సంబంధించిన సామానంతా బయట పారేసి 'నా యింట్లోంచి తక్షణం పొండ్రా! మిమ్మల్నందర్నీ చంపేస్తాను లేకపోతే!' అంటూ కేకలు వేస్తోంది. రాధమ్మకు పూర్తిగా మతి చెడిపోయిందని నిర్ధారణకు వచ్చినా, మాణిక్యం పైకిమాత్రం ఏమీ అనలేక, రాధమ్మ మాటలకు సమాధానం చెప్పక ఊరుకుంది. ఊరుకున్న మాణిక్యంపై విరగపడి 'పోతావా పోవా నా యింట్లోంచి' అంటూ చీపురు తీసుకుని బాదింది రాధమ్మ.

ప్రకాశానికి ఈ రభస అంతా చాలా ఆశ్చర్యం కలిగించింది. విజృంభించిన పరి

# ఒక తరహా మనిషి

**సత్యశ్రీ**

శర్మ, తన చదువుకి స్వస్తి చెప్పినట్లు తెల్పి మెల్లిగా శుభలేఖ చేతిలో పెట్టే సరికి అనంతం నివ్వెరపోయాడు.

కిటికీ రంగుటద్దాలలోనించి వర్షపుజడి చూస్తున్నాడు శర్మ. మూడురోజులనుంచి ముసురుపట్టి వదలకండా వుండేమో చలి చలిగా వుంది. ఈదురుగాలి జోరుగావీస్తోంది.

"చివరకు సాధించావు -" అని పేలవంగా నవ్వి, "పెళ్ళెక్కడ...? ఈ వూళ్లోనేనా...?" అన్నాడు అనంతం రోడ్డువైపు చూస్తూ. అలా అనేటప్పుడు అనంతం ముఖం ముడుచుకుపోయింది. అనంతం ముఖంలోకి అదో మాదిరిగా చూచి నవ్వాడు శర్మ.

అనంతం సిగ్గుపడ్డాడు. నాలుక కరచుకున్నాడు.

అవును - అదేం ప్రశ్న..? ఆ విషయం శుభలేఖలోనే వుంది...? తనిప్పుడేగా చదివింది...! అనుకున్నాడు.

"ఏం...? చదువు మానడం దేనికి...? పెళ్ళి చేసుకుంటే మాత్రం...? ఈ ఒక్క సంవత్సరమేగా...బి. ఎ. కంప్లీట్ చెయ్యి...!" అన్నాడు అనంతం. అవును- తన కెంత యిదిగా వుంటే మాత్రం...ఈ మాత్రమన్నా అనకపోతే వాడేమనుకుంటాడు...!? అనుకున్నాడు.

"అబ్బే...! యిక నాకు అటువంటి ఉద్దేశ్యం లేదోయ్...! నేను చదువుకుని ఉద్యోగం చేసి ఊళ్ళేలాల్సిన పనంటూ ఏమీ లేదు. మా నాన్న పుణ్యమా అంటూ బోలెడు సంపాదించి యిచ్చిపోయాడు.... హాయిగా, కులాసాగా, కాలుమీద కాలు వేసుకు బ్రతికొచ్చును...! కాదంటావా?"

గాజుగ్లాసును, పాలరాతి టేబుల్ మీద పెడుతూ నోట్లో నీళ్ళను గుటక వేశాడు అనంతం నీరసంగా! ఎందుకూ...? తనకూ వున్నాడు నాన్న...! ఛీ! అనుకున్నాడు.

పొగలుగ్రక్కే వేడివేడి కాఫీ త్రాగి, యిద్దరూ ఒక్కసారిగా కప్పుల్ని టేబుల్ మీద పెట్టేరు. బిల్లు టేబుల్ మీద పడిందే తడవుగా లాగేశాడు శర్మ. అనంతం, శర్మకేసి చూసి నవ్వాడు అదో మాదిరిగా. శర్మ కూడా నవ్వి అన్నాడు: "నీముఖం...! అదేమిటి..? ఎవరిస్తే ఏంపోయింది! నేనుమాత్రం పరాయివాణ్ణా...?"

అనంతం మనస్సులో యింకా ఏదో ఏదో అనుకున్నాడు.

ఇద్దరూ బయటకొచ్చేశారు.

"తప్పకుండా వస్తావుకదూ....? ప్రత్యేకంగా నేనువచ్చి ఆహ్వానిస్తాను ఆరోజున" అన్నాడు శర్మ.

"ఎందుకు రాను...?" అన్నాడు అనంతం ఏదో ఆలోచిస్తూ.

అనంతం చివరిరెండు మెట్లూ దిగి, 'వస్తా'నని చెబుతూ రోడ్డుమీద కాలు పెట్టి వెళ్ళటానికి ఉపక్రమించేవాణ్ణల్లా, శర్మ మందలించాడు.

"అదేమిటి...? చినుకులు పడ్తుంటేనూ...? నే బస్సులో వెళతాలే. గొడుగు తీస్కెళ్ళు!" అంటూ తెరచివున్న తన గొడుగు అందించాడు శర్మ.

అనంతం గొడుగు తీసుకుని వంతెనదాటి మలుపుతిరిగి రోడ్డుత్రోవ పట్టేడు. సగం దూరం వెళ్ళి గొడుగుమీద చినుకులుపడుతూ టపటపమని శబ్దం చేస్తూంటే, ఈదురుగాలి వెనక్కి నెడుతోంటే, చెప్పులులేని కాళ్ళమీది బురదను వగులువగులుగా వున్న పైజామా అందుకోబోతూంటే ఒకచేత్తో గొడుగును అదిమి పట్టుకుని, మరోచేత్తో పైజామాను పైకెత్తుకుని నడుస్తూ, స్పష్టంగా గొణిగాడు పైకే!

"ఛీ...! తానెందుకూ పనికిరాడు...!" అని!

* * *

అనంతం యింటిగుమ్మంలోకి అడుగు పెట్టగానే లోపలనుంచి చంటిదాని ఏడుపు మూసివున్న తలుపుసందుల్లోనుంచి దూసుకొచ్చి తలుపు కెదురుగా వున్న అనంతం గొడుగులో జొరబడి అనంతం చెవుల్ని గింగురులెత్తించింది!

అనంతం మండిపోయాడు.

అనంతం ఉడికిపోయాడు.

పళ్ళు 'పటపట' లాడించాడు!

అదే విసురుతో తలుపు గట్టిగా తట్టాడు.

భార్య శశిరేఖ వచ్చి తలుపు తీసింది. చంటిదాన్ని చంక నేసుకునే తలుపుతియ్యగానే మధ్యవసారాలో యినుపవూచనుంచి వేళ్లాడే హరికేన్‌లాంతరు వెలుగు ఒక్కుమ్మడిగా అనంతం ముఖానికి వెలుగుపూత పూసింది.

ముఖం చిట్లించి, కళ్ళు మూసుకుని లోపలకు వెళ్ళాడు అనంతం.

"చీకట్లోనుంచి వచ్చి, ఒక్కసారిగా

---

స్థితులు చూస్తూ తెల్లబోయి నుంచున్నాడు యింటి గుమ్మంలో.

రాధమ్మ దగ్గరకువెళ్ళి మాణిక్యం దీనంగా అడిగింది. 'ఒకటి రెండు రోజుల్లో నీయిల్లు ఖాళీ చేస్తాం. కొంచెం ఓపిక పట్టవే!' అని.

రాధమ్మ కొడుకుపేరు చెప్పి అరుస్తూ కాస్సేపు ఏడ్చింది. ఇంతవరకూ చేసిన రభస కళలు ఆమెలో మారాయి.

'ఒక వారంరోజులు దాటి ఇంట్లో ఉంటే మీ సామానంతా గిరగిరా విసిరేస్తాను అవతల' రాధమ్మ అరిచింది.

'అలాగే' అని వాగ్దాన మిచ్చినట్లు పలికిస్తూ, రభస తగ్గిందని సంతోషించింది మాణిక్యం.

మర్నాడు అవధాని వచ్చేడు. ఒక్కతే కొంతకాలం గడుపుతే, రాధమ్మ మనస్సు కుదురుపడుతుందేమో అని, ప్రకాశాన్ని తల్లీ పిల్లలతో, వేరే యింటికి మారమన్నాడు. కాని రాధమ్మను మాత్రం రోజుకోసారి వచ్చి చూసి వెడుతూండమని హెచ్చరిక చేసి, అంతకన్న ప్రస్తుతం చేసేది కూడా ఏమీ లేదనుకుంటూ తిరిగి వెంటకూరు వెళ్ళిపోయాడు అవధాని.

తక్షణం యిల్లు దొరకాలంటే సులువు కాదు. ఇల్లకోసం వెతికివెతికి వేసారి పోయాడు ప్రకాశం. వారం గడవగానే రాధమ్మ కేకలు, పెడబొబ్బలు, మరీ ఎక్కువైనాయి. ఇంక ఈ బాధపడలేక పాత కాకినాడలో ఒక పాతయింట్లో పదిహేను రూపాయిల అద్దెకు ఒక యిల్లు తీసుకున్నాడు ప్రకాశం. పరిసరాలు, యింటిపరిస్థితులు గమనించడానికి వ్యవధి లేకపోయింది. తన కుటుంబంతో ప్రకాశం ఒకరోజు వచ్చి అక్కడ ప్రవేశించాడు. ఒంటరిగా విడువబడిన రాధమ్మ ఆరోగ్యంగురించి విచారిస్తూ, తన్నభిమానంతో సహాయకారిగా ఆదుకున్న ఆప్తబంధువుకు సేవ చెయ్యలేని పరిస్థితులు ఏర్పడ్డాయని, విధి వైచిత్ర్యానికి విస్తుపోయాడు ప్రకాశం.

(ఇంకా వుంది)



# ఒక తరహా మనిషి



వెలుగును చూట్టంవల్ల......!" అనుకుంది భార్య.

"బహుశ ఈదురుగాలికి...!" అనుకున్నాడు అనంతం తండ్రి, అప్పుడే భోజనం చేసి పై పంచెకి చేతు లద్దుకుంటూ గుమ్మం లోకి వస్తూ.

ప్రొద్దున్న కాచిన నీళ్ళచారు, నిన్న రాత్రి చేసిన కందిపచ్చడి వుంటే వేసుకుని రెండెంటే రెండే ముద్దలు, గొణుక్కుంటూ తిని, వచ్చి అరుగుమీద కూర్చున్నాడు అనంతం పడక కుర్చీలో.

బయట యింకా చినుకులు పడుతూనే వున్నై. రోడ్డుకి అవతలప్రక్కవున్న ఎలక్ట్రిక్ లైటు వెలుగులో, పైనుంచి పడే తుంపర గమ్మత్తుగా కనిపిస్తోంది. ఇంటి ముందున్న తూముక్రిందనుంచి మురుగు కాల్వ 'పడపడ' ప్రవహిస్తోంది. ఇంటి పరిసరాల్లో, రోడ్డుకిరుప్రక్కలా వున్న బండల క్రింద బొరియల్లోను, నివసించే కీటకాలు చేసే కలకలం ఒకవిధంగా అనంతాన్ని ఊరడిస్తోంది; ఒకవిధంగా హెచ్చరిస్తోంది.

అనంతం అటువంటి ప్రకృతిలో లీనమై కొంతతడవాగి అనుకున్నాడు: "తను పెట్టివుంటే ఏనాడో శశికళ తనదైపోయేది. అప్పుడు తనీ 'రొంపి'లో దిగబడేవాడా..? అసలు శర్మన్నాత్రం సిరిఎత్తుకుంది ఈమధ్యనేగా...! తనతండ్రే చెప్పేవాడు అప్పుడప్పుడూ: శర్మ తండ్రి మొదట ఈవూరు బీదవాడుగా వచ్చి చిన్నచిన్న మురుగు కాల్వలకి తూములూ అవీ, కంట్రాక్టు తీసుకుని కట్టటంతో మొదలుపెట్టి రానురాను పెద్దపెద్ద గవర్నమెంట్ కట్టడాలు కంట్రాక్టు తీసుకోవంతో సిరిఎత్తుకుంది ...! పోతూ పోతూ వాడికి పెద్దమేడా, కావలసినంత ఆస్తి యిచ్చిపోయాడు ...! ఎందుకూ 'తనతండ్రికి అంత తెలివితేటలే వున్నట్టైతే తను ఏనాడో బాగుపడేవాడు. పైగా తను నక్కాలు వదలిపెట్టిన వెంటనే తనకు మామయ్య కూతుర్ని కట్టబెట్టేశాడు. తనకు చిల్లిగవ్వ కూడా యివ్వలేదు పెళ్ళిలో...! తనకప్పుడే యిద్దరు పిల్లలు...మళ్ళా పదిపదిహేనురోజుల్లో మూడోదౌతయారు..! ఛీ! తను పెద్దరొంపిలో దిగబడిపోయాడు! తనకు శాంతి లేదు...!

ఇంకా, ఇంకా......ఏవో తలపోసుకున్నాడు అనంతం. గత జీవితంలోని కొన్ని కొన్ని మధురస్మృతుల్ని ఏరి కోరి ఆహ్వానించుకుని తన్మయుడైపోయాడు.

"శశి...! నా శశీ...!!"

అప్రయత్నంగా కళ్ళు తెరవకుండానే, అలానే కుర్చీలో సొమ్మసిల్లినట్టు పడుకుని వుండే, స్పష్టంగా...ఆప్యాయంగా..., ప్రణయం పుట్టిపడేలా అనేశాడు. పైకే...!

ప్రక్కనే ద్వారబంధానికానుకుని, కడుపులో ఒక పాపను, మోకాటిమీద తల పెట్టి నిద్రపోతూన్న 'బుజ్జిగాణ్ని', వళ్ళో పడుకుని పాలురాక కసిగా రొమ్ముల్ని గీరుతూన్న చంటిదాన్ని మోస్తూ, ద్వారానికి తల ఆన్చి, కునికిపాట్లుపడుతూన్న అనంతం భార్యకు ఈ పిలుపు వినిపించగానే ఉలిక్కిపడ్డది! వళ్లు ఝల్లుమంది. మనస్సు పులకరించింది. గుంటలుపడి జీవకళ క్షీణించి పోతూన్న కళ్లు వింతశోభతో ప్రకాశించినై. సిగ్గు ముంచుకొచ్చేసింది. "ఏవిటి!.. ఈ వేళ తనమీద యింత అనుగ్రహం కలిగిందేం తన భర్తకు...? ఎంత ఆప్యాయంగా వుంది పిలుపు...? ఎప్పుడూ లేంది తన పేరు పెట్టి...? అబ్బ...!" అనుకుంది పరవశం అవుతూ.

మోకాటిమీద పడుకున్న బుజ్జిగాణ్ని గచ్చుమీద అలానే పడుకోబెట్టి, వళ్లో చంటిదాన్ని చేతుల్లోకి తీసుకుని లేవటానికి ప్రయత్నిస్తూ—

"ఊఁ......!" అంది మధురంగా, శ్రావ్యంగా.

స్వాప్నిక జగత్తులో విహరించే అనంతానికి భార్య జవాబు, తను ఊహించుకుని తేలిపోతూన్న మధుర ఘట్టాల్ని ఒక్క వేటులో ముక్కలు చేసినట్లై ఉలిక్కిపడి కళ్లు తెరచి భార్యకేసి ఎఱ్ఱగా చూచి, 'హుఁ!' అని మూలిగాడు.

"నువ్వింకా మేల్కొని వున్నావే? ప్రొద్దుపోలే...? పడుకోకూడదూ పోయి" అంటూ కసిరాడు.

భార్య నీరై, తలుపుకి అలానే జేరబడిపోయింది చంటిదాన్ని హృదయానికి కదుముకుంటూ.

"ఇదేమిటి? ఇంతలోనే యింత మార్పు" అనుకుంది.

ఇక అనంతానికి అరుగుమీద కూర్చో బుద్ధికాలేదు. లోపల కొచ్చేడు విసురుగా.

* * *

తెల్లవారింది. ముసురు తగ్గిపోయి వాతావరణం ప్రశాంతంగా వుంది. మబ్బు విడిచిన ఎండేమో, చుర్రుమంటోంది.

ఆరాత్రి అనంతం ఏమి ఆలోచించాడో చెప్పడం కష్టంగాని, ప్రొద్దున్నే కాఫీ త్రాగి, స్టేషన్‌కి పరుగెత్తుకొచ్చి అప్పుడే బయలు దేరబోతోన్న రైల్లో పడ్డాడు ఒగరుస్తూ.

"పాపం! మామయ్య కెలాగుందో? ఏమిటి ఈ వేళ మామయ్యమీద యింత జాలి పుట్టుకొస్తోందేం తనకు? అనుకోకుండా బయలు దేరాడు పాలెం!" అనుకున్నాడు.

అనంతం కూర్చున్న బెంచీకి ఎదురుగా అంతవరకూ పేపరు ముఖానికి అడ్డుపెట్టుకుని చదువుకుంటూన్న వ్యక్తి, పేపరు దించి ఎదురుగా వున్న అనంతాన్ని చూచి పలుకరించాడు.

"ఏమోయ్! అనంతం! ఎంతవాడివయ్యావ్? చాలా రోజులైంది నిన్ను చూచి ఎక్కడకు బయలుదేరావ్?"

అనంతం ఉలిక్కిపడి చూచాడు.

ఎవరది? డా॥ శివంగారుకదూ..? అయిదారు సంవత్సరాలవుతుంది తన వూరు వదిలిపెట్టి...తనప్పుడు చదువుకుంటూన్నాడు.

అనంతం నవ్వాడు. డాక్టరుగారు తను అక్కడుండానే విశాఖపట్టణంలో వుంటున్నానని చెప్పుకొస్తూ చాలా చాలా ప్రశ్నలు వేశాడు.

"అయితే యిప్పుడు నువ్వేం చేస్తూన్నట్టు? చదువు అదీ అయిపోయిందా? పెళ్ళి? మీ నాన్న కులాసాయేనా? పాపం ఆయన దగ్గిరేం వుంది? నేనుండే టప్పుడే చాలా బాధపడేవాడు పాపం!" ఇలాంటి ప్రశ్నలే వేసుకొస్తూ, "చూచావ్ అనంతం, మీనాన్న చాలా యోగ్యుడు. ఎంత ఓర్పు, ఎంత శాంతం, పాపం ఆయన కాబట్టే, మీ తాత పూర్వం చేసిన అప్పులన్నీ చిల్లిగవ్వ లేకుండా తీర్చేసి, నలుగుర్లో అవమానం పొందకుండా 'సెహబాస్' అనిపించుకున్నాడు! ఆయన సంపాదించినంతా అటువంటివాటికే అయిపోయింది! మొన్న మొన్నటివరకూ నీతోనే బతిమాలివాతుండే వారు! నీకు పదిహేళ్లు వచ్చేవరకూ ఏదో అవస్థతగానే వుండేది. ఎంత డబ్బు పోసేరు! ఎన్నిపాట్లు పడ్డారు నీకోసం?! అలా చేయబట్టేగా నువ్వ అక్కరకొచ్చావు ఆయనకి!" అంటూ యింకా, ఏవో ఏవో పొగిడాడు డాక్టరుగారు—

తండ్రిని పొగుడుతూన్నంతసేపూ చిటపటలాడాడు అనంతం లోలోన!

"ఎందుకూ? అప్పులు తీర్చాడట. అప్పులు! అలా పాడుచెయ్యబట్టేగా తనిప్పుడు బాధపడుతూంట!" అనుకున్నాడు.

మొత్తమ్మీద అనంతం, తనకు, డాక్టరుగారికికూడా తృప్తినిచ్చే జవాబులే చెప్పుకున్నాడు.

'పాలెం' చేరుకోవాలంటే మరో రెండు స్టేషన్లు దాటాలి. ఈ వచ్చే స్టేషన్లో 'క్రాసింగ్' వుంటంవల్ల, మెయిన్‌లైన్ వదలి, 'లూప్‌లైన్'మీద ఆగింది బండి. ప్లాట్‌ఫారంమీద మరో ట్రెయిన్ వుంది.

అనంతం కొంచం వూపిరి తీసుకుని, వెనక్కి తిరిగి కిటికీలోంచి ముఖంపెట్టి అవతలి రైల్లోకి చూచాడు. చూచి ఉలిక్కిపడ్డాడు ఎందుకో.

"ఎవరది? సుబ్బారాయుడుకదూ? ఎక్క

డికి వెళుతున్నాడో? కొంపతీసి!" యింకా ఏవో అనుకునేలోపులే అతను అనంతాన్ని చూచి ఆదుర్దాగా రైలు దిగివచ్చాడు దగ్గరకు...

"పాలెం వేంనా వెళ్లేది? శశిరేఖఅక్క ఏది? పాపం మావయ్యకు చాలా ప్రమాదంగా వుంది...మొన్న ఉత్తరం కూడా వ్రాశారటగా యిద్దర్నీ రమ్మని. ఈ వేళ మరీ ప్రమాదంగా వుంటే నన్ను పంపేరు తీసుకు రమ్మని. పద - యిక నేనెందుకు వెళ్లటం. మీతో పాటుగానే వచ్చేస్తాను. నేను ముందే అనుకున్నాలే. బహుశ మీరు ఈ ట్రెయిన్‌లో వుంటారని." గుక్క తిప్పుకోకుండా చెప్పుకొచ్చాడు అతను.

అనంతం నీరయ్యాడు.

ఛీ! యిలా జరుగుతుందని తను అనుకున్నాడా? యింత ప్రమాదస్థితిలో వున్నాడని తెలిస్తే ముందే వెంటబెట్టుకొచ్చేవాడు దాన్ని. నిన్న ఉత్తరంకూడా వచ్చింది.- నిర్లక్ష్యం చేసేడు తను. అయినా ఒకరోజు కూడా తిరక్కముందే యింత ముంచుకొస్తుందని తనుమాత్రం కలగన్నాడా...? ఇలా అనుకుని, పైకి అతనితో అబద్ధమాడేడు.

"రాదు. సుబ్బరాయుడు!! యింత ప్రమాదంగా వుందని తెలిస్తే అప్పుడే వెంటపెట్టుకొద్దును మీ అక్కను. అయినా నాకు ఉత్తరం కూడా అందలేదు. మామూలుగా వుందిగదా అనే వుద్దేశ్యంతో నేనొక్కణ్ణే బయలుదేరాను. ఎలాగు నువ్వెళుతున్నావుగా. సాయంత్రం ఆరున్నర బండికి వెంటబెట్టుకొచ్చేయ్! మావయ్యకేం ఫరవాలేదు. నాకు ముందే తెలిస్తే యింత అజాగ్రత్తగా వుండేవాణ్ని కాను." చాలా బాధపడినట్టే కనిపించాడు అనంతం.

అతను యిక ఏమీ మాట్లాడలేకపోయాడు.

"సరే., ఏం చేస్తాం తెలియందానికి? ప్రమాదంగానే వుంది. అక్కను చూస్తాదో లేదో."

—అనేసి, కదిలిపోయే రైలు ఎక్కేడు పరుగెత్తుకెళ్ళి.

కొన్ని క్షణాలవరకూ అలానే వుండిపోయాడు అనంతం.

"ఈ విషయంలో తను పొరపాటు చేశాడా...? ఉత్తర మొచ్చినా ఎవరితోనూ చెప్పలేదు తను. ఆ సమయంలో అలా కనిపించింది తనకు" అనుకున్నాడు అనంతం.

*     *     *     *

పాలెంలో దిగి, మామయ్య యింటి గుమ్మంలో అడుగుపెట్టేసరికి పరిస్థితి చాలా ఆందోళనగానే వుంది. అనంతం చుట్టూ మూగి, శశిరేఖ గురించి ప్రశ్నల వర్షం కురిపించారు. అంత్రకితం అతను అతనితో చెప్పిన అబద్ధాన్నే మరి కొంత శ్రమతగా ముఖంలో విచారాన్ని వెలిబుచ్చుతూ చెప్పేడు అనంతం. అత్తయ్య కన్నీళ్లుపెట్టుకుంది.

"తుదిఘడియల్లో కూడా ఆయన్ని చూచుకునే రాత లేదేమో...దానికి!" అంటూ చాలా నొచ్చుకుంది.

ఇదంతా చూస్తుంటే అనంతానికి 'ఛ!' అనిపించింది. అసలు తనెందుకు వచ్చాడా అనుకున్నాడు!

మామయ్య పడుకున్న గదిలోకి వెళ్లేడు అనంతం. మామయ్య స్థితి చాలా భయంకరంగా వుంది. మంచానికి అతుక్కుపోయి చైతన్యరహితంగా పడివున్నాడు. మాట లేదు. కళ్లుమాత్రం తెరచుకుని అందరికేసి ఆశగా చూస్తూన్నై.

అనంతం వెళ్లి మామయ్య మంచం మీద కూర్చున్నాడు. మామయ్య ఏదో ఏదో అడగాలనుకున్నాడు. మాట్లాడటానికి ప్రయత్నించాడు. పెదాలు మాత్రం కదిలాయి. అంతే మరేవిధమైన శబ్దమూ వెలువడలేదు. మామయ్య కళ్లు దేనికోసమో వెతికాయి.

అనంతమే అన్నాడు: "నీకేం ఫరవాలేదు మామయ్యా...?" మరో రెండు గంటల్లో శశిరేఖ వచ్చేస్తుంది. సుబ్బారాయుడు వెళ్లాడుగా" అని.

అయితే మామయ్య ఎంతకాలమో బ్రతకలేదు. సాయంత్రం అయిదుగంటలకే ప్రపంచాన్ని విడిచిపెట్టేడు మామయ్య—

రాత్రి ఏడుగంటలకు శశిరేఖ వచ్చింది పిల్లల్ని తీసుకుని. తండ్రి చనిపోయేటప్పుడు దగ్గర లేకపోవటంవల్లో ఏమో మరీ కుమిలిపోయింది శశిరేఖ.

ఇదంతా చూస్తూ అనంతం అనుకున్నాడు ఈసారి: "ఏమిటో...! ఈ వేళ తను యింత మూర్ఖుడయ్యాడే...?" అని.

*     *     *     *

మామయ్య 'కర్మ' అదీ అయిపోయిన తరువాత శశిరేఖనుతీసుకొచ్చేశాడు అనంతం. మామయ్యకున్న 20 ఎకరాల పొలంలో తన భార్య వాటాక్రింద అయిదెకరాల మాగాణి రాసిపోయాడు! ఇది అనంతానికి ఒక విధంగా తృప్తిని, మరోవిధంగా అసంతృప్తిని కలుగజేసింది. "అసలు తండ్రి ఆస్తిలో కూతురుకికూడా సమానభాగం రావాలి. మామయ్యకున్నది మరో కొడుకేగా" అనుకున్నాడు.

తండ్రిమరణంతో శశిరేఖకు పెద్ద 'షాక్' తగిలినట్టై ఎప్పుడూ దిగులుగా వుండేది. పదిహేనురోజుల్లో మనిషి మరీ నన్నబడిపోయింది. తెల్లగా పాలిపోయి కట్టెలా తయారైంది. ఆమెలో నిండుగా, ఎత్తుగా కనిపించేవల్లా ఒక్క గర్భంమాత్రమే. జీవకళపోతూన్న ఆమెకళ్లు ఎప్పుడూ దేనికోసమో వెతుకుతూన్నట్టు ఏదో అవ్యక్తమైన క్లేశాన్ని, అసంతృప్తిని అనుభవిస్తూన్నట్టు వుండేవి...!

అనంతం భార్యను రోజూ చూస్తూనే వుండేవాడు. చూచి అనుకునేవాడు... "రోజురోజుకి యిలా తయారవుతుందే తన భార్య...?" అని. అంతే అనుకోడంవరకే తనపని.

ఆవేళసాయంత్రం పూరంతా తిరిగి యింటికి చేరుకునేసరికి ఆరుగంటలైంది. గదిలోనుంచి మూలుగు వినిపిస్తోంది. చంటిదాన్ని భుజంమీద పడుకోబెట్టుకుని తండ్రి అరుగుమీద అటు, యిటు తిరుగుతూన్నాడు మధ్యమధ్య దగ్గుతూ. అనంతాన్ని చూచి అన్నాడు:

"కోడలు రెండుగంటలనుంచి బాధపడుతోంది. నేను మొన్ననే చెప్పేను అత్తయ్యను తీసుకొచ్చి పెట్టుకుంటే మంచిదని. మనకిక యింట్లో ఆడదిక్కెవరున్నారు గనుక—నువ్వు ఏమీ పట్టించుకోకపోతే ఎల్లారా అన్నీళ్లు వచ్చి? పైగా మరో బిడ్డకు తండ్రివి కాబోతున్నావు" కొంత ఘాటుగానే పెట్టేడు తండ్రి విసుక్కుంటూ.

అనంతం కొన్ని క్షణాలు అలానే వున్నాడు ఏదో ఆలోచిస్తూ. అప్రయత్నంగా చైతన్యం కలిగినవాడిలా ఏమీ సమాధానం చెప్పకుండా బయటకు వెళ్ళి అయిదునిమిషాల్లో తిరిగి వచ్చాడు.

"బండి తీసుకొచ్చాను...! యింటిదగ్గర కన్నా హాస్పిటల్‌లో జాయన్ చేయిస్తే మంచిది...! చంటిది అక్కడేగా పుట్టింది ...! ఈలోపుగా అత్తయ్యకు కబురంపుతాను...! రేపు ప్రొద్దున్నకల్లా యిక్కడుంటుంది...! అయినా యింత తొందరగా వస్తుందని - నేనుమాత్రం అనుకున్నానా ఏమిటి...?"

తండ్రి యిక ఏమీ మాట్లాడలేకపోయాడు. ముఖం చిట్లించుకుని గొణుక్కున్నాడు. "కొత్తేముందిలే. తెలియందా?" అని.

అనంతం వెంటనే భార్యను తీసుకెళ్లి హాస్పిటల్‌లో జాయిన్ చేయించి, అత్తయ్యకోసం పాలెం వెళ్ళటానికి ఎవర్నో పురమాయించి, తను యింటికి వచ్చి ప్రొద్దున్న వండిన అన్నమే వుంటే తిని, పిల్లల్ని యిద్దరినీ తీసుకుని ఆస్పత్రికి బయలుదేరాడు.

రాత్రి తొమ్మిదిగంటలు కావస్తోంది. గదిలోనుంచి భార్య మూలుగు భయంకరంగా వినిపిస్తోంది. అయిదు నిమిషాల క్రితమే డాక్టరు తలుపు తెరచుకుని వచ్చి దేనికో బాగా చివాట్లుపెట్టి గదిలోకి వెళ్లిపోయింది. బుజ్జిగాణ్ని అలానే గచ్చుమీద పడుకోబెట్టేడు. చంటిదాన్ని భుజంమీద వేసుకుని త్రిప్పుతున్నాడు అనంతం.

"ఆవిడ చాలా బలహీనంగా వుంది...!



ఒడ్డుచేరిన నావ

ఫోటో: పి. సి. ఎస్. ఈశ్వర బాబు—మద్రాసు

★

"కనటం చాలా కష్టం...!" యింటాక డాక్టరు చెప్పిన చివాట్లు అవి.

"అవును – తన కిప్పుడు తెలిసొస్తోంది తన యింట్లో తిండికూడా సరిగా వుండేది కాదు. ఆ మనిష్యి బ్రతికివుండగా కూడా ఎంత సహాయం చేసేవాడు...? తన తండ్రి చెప్పినటు ఆ కొట్లో పద్దులు రాయటానికన్నా పనికిరాడు కాడు తను...అలా అన్నా ఒక మాదిరిగా గడిచేది తన యింట్లో. కాని తన కష్టాల్లో ఏమీ చెయ్య బుద్ధి అయ్యేదికాదు. తన కెక్కడలేని నిర్లక్ష్యం, అశాంతి, అసంతృప్తి వంటాడేవి...! తనుమాత్రం ఏమి చేస్తాడు...? తన మనస్సు తనను అలా నడిపిస్తోంటే.

ఎప్పుడూ లేంది అనంతానికి పశ్చాత్తాపం కలుగసాగింది ఈసారి.

మధ్య హాల్లోవున్న గడియారం పన్నెండు గంటలు కొట్టింది. గది తలుపులు తెరుచుకున్నై. డాక్టరు బయటకు వచ్చింది. అనంతం ఉలిక్కిపడ్డాడు.

"నే నప్పుడే అనుకున్నాను. ఆవిడ కన్నది. కాని, బిడ్డ చనిపోయింది. తల్లి విషయంకూడా చెప్పటం కష్టమే. ఆవిడకు మనోవ్యథ, దుర్బలత్వం చాలా కాలంనుంచి బాగా జీర్ణించిపోయాయి. పైగా ఏమీ కొన్ను. వెళ్లండి... పిల్లల్ని తీసుకెళ్ళి చూపించండి. చెప్పటం కష్టం," అనేసి డాక్టరు వెళ్ళిపోయింది.

అనంతం కాళ్లు తడబడిపోయాయి. వెంటనే తండ్రికోసం కబురు పంపేడు. నర్సు సహాయంతో పిల్లల్ని తీసుకుని లోపల కెళ్లాడు అనంతం.

గదిలో శశిరేఖ మంచానికి అతుక్కుని సరిగా కనిపించడం లేదు. కళ్లు మూసుకునే వుంది అస్పష్టంగా మూలుగుతూ.

పిల్లల గోల విని బరువుగా కళ్లు విప్పి చూసింది.

పిల్లలూ, తనూ మంచంమీద కూర్చున్నారు.

శశిరేఖ పిల్లల్ని దగ్గరగా తీసుకుంది. హృదయానికి అదుముకుంది. అనంతం కన్నీళ్లు పెట్టుకున్నాడు! శశిరేఖ కళ్ళల్లో యింకా ఏదో ఆశ మెరుస్తునేవుంది. ఆమె కళ్లు దేనికోసమో వెతుకుతూనే వున్నై! ఏదో మాట్లాడాలనుకుంది. కాని నోరు రాలేదు. అనంతం చేతిని తన చేతిలోకి తీసుకుని గట్టిగా పట్టుకుంది.

ఇంతలోనే గాలివిసురికి, కిటికీ తలుపులు ఒక్కసారిగా తెరుచుకున్నై. అదే సమయంలో బయట, దూరంగా మసక చీకట్లో కనుపించే తాటితోపులోకి ఒక ఉల్క రాలి అంతర్ధానమై పోయింది. ★

# గ్రహపాటు

ఓగేటి శివరామకృష్ణ

చీకటి పడింది. దీపాలు వెలిగించే సమయానికి ఆఫీసు ఫైళ్లతో సదానందం యింటికి తిరిగివచ్చాడు. అంతక్రితమే వంట పని పూర్తిచేసుకొన్నది శ్యామల. బయట నుంచి విసిగి వేసారి వచ్చిన భర్తను యే మాత్రం లక్ష్యపెట్టకుండా, అతడు కాళ్లు కడుక్కొని కుర్చీలో కూర్చొనటం తడవుగా తీవ్రంగా యేమిటేమిటో అనేసింది. ఆమె వదనం యెఱ్ఱపడింది; గొంతుక బొంగురుపోయింది!

కుర్చీలో కూర్చున్న సదానందం భార్య అనే మాటలన్నీ ఓర్పుతో విన్నాడు. ఆమె ఉద్రేకంతో ఆ మాటలన్నా - వాటిలో అసత్యం యేమాత్రం లేదు. అవును— అప్పుడు—ఎంతకాలంనుంచో యెదురు చూస్తున్న వేయి రూపాయల మొత్తం తన చేతిలో పడింది. అంతకు రెట్టింపు అప్పులతో తాను సతమతమాతున్నాడు. అంది వది—అప్పులవాళ్లకేదోవిధంగా సర్దుబాటు చేసి, కొంత గొడవ వదుల్చుకొందాం అని తాననుకుంటూండగా—పెదనాన్న సూర్యప్రకాశంగారు వచ్చి, తన్నా మొత్తాన్ని అప్పుగా యివ్వవలసిందని కోరాడు; ఆయన కూతురు వివాహం తలపెట్టుకొన్నాడట...ఇస్తానన్నవాడు 'ప్రస్తుతం లేద'ని ఆయన్ను దగాచేశాడట......ఎలాగయినా పెదనాన్న..."నిన్ను నమ్ముకున్నాను"- అని ఆయన అంటూంటే తాను కాదనలేకపోయాడు. ఇచ్చేశాడు! ఇదే తాను చేసిన పొరపాటు!

సొమ్ము ,ఆయన చేతిలోకి పోయి, ఎనిమిది నెలల చిల్లర అయింది! ఆయన డబ్బు యివ్వలేదు సరిగదా, ఉత్తరంముక్కయినా రాయటంలేదు. ఆయన అక్కఱమాత్రం తీర్చుకొన్నాడు. తమ బాకీలకోసం,అప్పుల వాళ్లు మాత్రం తన యింటిచుట్టూ తిరిగి నానామాటలూ అని వెడుతున్నారు. తన బ్రతుకు కొరివితో తలగోక్కున్నట్లయింది! అంతా ఖర్మం!

"నే అప్రయోజకుణ్ని"—అన్నాడు సదానందం!

"మనిషి యెంతవున్నా కోపంమాత్రం పుట్టేదు"—అంది శ్యామల!

"కోపం యెందుకూ? అటువంటి పొరపాటు చేశాను కనుక నే యిప్పుడందరిచేతా మాటలు పడుతున్నాను; నానా యిబ్బందీ పడుతున్నాను. ఎంతయినా ఆయన నా పెదతండ్రిగదా ... జరిగిన పొరపాటు యేలాగూ జరిగింది—" అన్నాడు సదా సదానందం.

"అయితే యింకా యీలా వూరుకొని అప్పులవాళ్ల చేత చివాట్లు తింటూంటారన్న మాట ?"

"మరేం చేయమంటావ్ ?"

"వెంటనే బయలుదేరి-లెఖ్ఖఅడిగి తెచ్చుకొనటమో లేకుంటే, వెంటనేవచ్చి యివ్వవలసిందని రాయటమో జరపాలి. "సరి-" అన్నాడు సదానందం!

"రెండురోజులు సెలవుపడేసి, వెళ్లి వ్యవహారం పైసలు చేసురాగూడదూ ?"

"ప్రస్తుతంలో వెళ్లటం యేలా కుదురుతుంది? ఆఫీసరు సెలవు యివ్వడు. పని చాలా వత్తిడిగావుంది-" అని తప్పించుకొన్నాడు సదానందం.

"సరయితే వుత్తరం అయినా కొంచెం ఘాటుగా రాయండి"

"ఓ-"అతడు, తనకోటు జేబులోంచి, ఒక కార్డుతీసి, తెచ్చి, వ్రాసి, భార్యకు విన్పించాడు. "బాగా వ్రాశారండీ! ఆయన అభిమానం యేమాత్రం కలిగివున్నా వెంటనే డబ్బుతో వాల్తాడు-" అంది శ్యామల!

సదానందం వుత్తరం, తిరిగి కోటుజేబులో భద్రపరచబోతున్నాడు! ఇది శ్యామల చూసింది! భర్తకు బద్ధకం యెక్కువ. ఉత్తరం ఆయన కోటుజేబులో ప్రవేశించిందంటే పోస్టయినట్టే!

"వుత్తరం పోస్టులోపడేసిరండి-" అంది శ్యామల !

సదానందం "ఉహూ-" అన్నాడు!

"సరయితే-"అని చదువుకుంటున్న, పదకొండేళ్ళ తన కొడుక్కు వుత్తరం యిచ్చి "జాగ్రత్తగా పోస్టుఆఫీసులో పడేసిరా" అంది.

"ఓ-" అంటూ బయలుదేరాడువాడు !

* * * *

ఆ అబ్బాయి, ఎలక్ట్రిక్ దీపాలవెలుగున, పోస్టాఫీసుదగ్గిరకు నడుస్తూ, ఒక స్తంభం దగ్గర నిలచి-ఆకార్డుచదువుతూంటే, వెనకతట్టుగా, అతగాడి స్నేహితుడొకడు హఠాత్తుగావచ్చి "ఏమిట్రా ఆవుత్తరం-" అంటూ చూచే కాంక్షతో లాగపోయాడు! ఉత్తరంరాలేదుకాని, బలవంతంగా లాగటంవల్ల ఆ కార్డు రెండు ముక్కలయి కూర్చుంది!

ఆ కుఱ్ఱవాళ్ళిద్దరూ ఒకరి ముఖాలు మరొకళ్ళుచూసుకొన్నారు.

ఏంచేయాలో కొద్దికాలం యిద్దరకూ తోచలేదు.

"ఉత్తరం పోస్టులో వేయలేదంటే మా అమ్మ చంపేస్తుంది. మా నాన్న నావగొడ్తాడు"— అబ్బాయి బిక్కముఖం పెట్టాడు!

"పొరపాటు జరిగిపోయింది... అయినా ..."—అబ్బాయి స్నేహితుడేమిటో అనబోయాడు !

"ఇంటిదగ్గర యేమని చెప్పేది?" అబ్బాయి స్నేహితుడు కొంచెం ఆలోచించి" పోస్టులో పడేశానను"-అన్నాడు !

"జవాబు రాకుంటే"

"ఓస్...అదా...అప్పుడప్పుడు కొన్ని వుత్తరాలు పోస్టులో పోతూంటాయి. అందువల్ల భయంలేదు. వాళ్లు వుత్తరం యెక్కడో పోయిందనుకుంటారు. నివు మాత్రం వుత్తరం పోస్టులో పడేశానను. అబ్బాయి భయంతీరింది" సరి. నే మరి యింటికి పోతాను"— అంటూ వాడు వెనక్కు తిరిగాడు !

"మరేంభయంలేదు. ఉత్తరం పోస్టుచేశానని చెప్పుసుమా—" అంటూ అబ్బాయి స్నేహితుడు ముందుకు సాగిపోయాడు. రెండుముక్కల కార్డుమాత్రం అక్కడేపడి దొర్లుతూంది.

* * *

సదానందం, అతగాడి పెదనాన్న దగ్గర నుంచి, రాబోయేసొమ్ముకోసం, జవాబు కోసం ఆదుర్దాతో యెదురుచూస్తున్నాడు. అబ్బాయి పోస్టులో వుత్తరం వేశాడనే ఆ దంపతులు భావించారు. అందుకనే—దాని కోసం యెదురుచూస్తూంట.

పదకొండురోజులుగడిచిపోయినాయ్...

సూర్యప్రకాశంగారు రాలేదు సరిగదా, ఆయననుంచి జవాబైనా లేదు. వ్రాసినవుత్తరాన్ని పురస్కరించుకొని, త్వరలో పెదనాన్న మొత్తం యిస్తాడని వూహించి, గొప్పగా కొందరు యివ్వవలసిన వాళ్ళకు

సదానందం గడువుపెట్టడం గూడా జరిగింది —ఆ గడువు దాటిపోయింది! అదీ ఆదివారం మధ్యాహ్న కాలం—బాకీ వాళ్లు వచ్చి డబ్బడిగారు. సదానందం తెల్లబోయాడు. వాళ్లు నానామాటలూ అని వెళ్ళిపోయారు. తెల తెలబోతూన్న అతగాడితో: "మీ ప్రయోజకత్వం యెప్పుడూ యింతే! నే నేమిటో అనుకొన్నాను. ఎంత దగ్గర వాళ్లయితే మాత్రం—వుత్తరాలకు వూడిపడతారా? మంత్రాలకు చింతకాయలు రాలే రోజులు పోయాయి. మీ రెంత గొప్పగా వుత్తరం వ్రాసినా ఆయన పట్టించుకోలేదు. అయినా ఆ డబ్బు మొత్తంగా మీ చేతిలో పడకుండా, ఫలానా నాటికి డబ్బు యివ్వగలనని బాకీ వాళ్ళతో మీరేలా చెప్పారండీ?" అని అడిగింది శ్యామల!

"పొరపాటు జరిగిపోయింది" - ఒప్పుకొన్నాడు సదానందం!

"పొరపాటు కాదు...అంతా గ్రహపాటు...అయినా...మీరు ప్రతీ చిన్న విషయానికీ గొప్ప వెలగబోస్తారు. అందుకనే - నానామాటలూ పడుతూండటం."

"అవును. నే అప్రయోజకుడ్ని" - కోపం వచ్చేసింది సదానందంకు!

"మాటమాటకూ అదొకటి. అప్పులవాళ్లకు జవాబు చెప్పటానికీ - మీ అప్రయోజకత్వానికి సంబంధం యేమిటండీ?"

"అంతా సంబంధమే" - విసురుగా అని, చొక్కా జేబులో నలిగివున్న ఒక పోస్టు కార్డుతీసి, యేమిటో వడిగా రాసి "తాడో బొంగరమో ఈ వుత్తరానికి తేలిపోవాలి... శనివారం నాటికి, జవాబు గాని, ఆ రాత్రి, జనతాకు ఆయన రాక గాని లేనిపక్షంలో, ఆ రాత్రే అటుపోయే జనతాకు - సెలవు పడేసి వెళ్ళి, ఆయన నెత్తిమీద కూర్చుని అణా పైసలతో డబ్బు వసూలు చేసి తీసుకు వస్తాను. అప్పుడు నీకు నే ప్రయోజకుడ్నో, అప్రయోజకుడ్నో అర్థం అవుతుంది. దానికింక ఏ గ్రహపాటూ అడ్డురాదు" - అంటూ బయటకు, వుత్తరంతో సదానందం వెళ్ళిపోయాడు!

"తిరిగి వుత్తరం వ్రాస్తున్నారన్నమాట."

"ఆ."

"జవాబొచ్చినట్లే - మనకు డబ్బు ముట్టినట్లే" - నవ్వింది శ్యామల!

"ఛీ...ఛీ...నీ వెప్పుడూ యింతే" - అంటూ ఆమె నేమాత్రం పట్టించుకోకుండా, బయటకు నడిచాడు సదానందం!

అక్కడే కూర్చుని తెలుగు పద్యాలు వల్లె వేస్తున్నవాళ్లి అబ్బాయి యెందుకో నవ్వాడు. తల్లి వాడ్ని కారణం అడిగింది.

"ఏం లేదమ్మా" - అని తిరిగి నవ్వాడా కుఱ్ఱాడు.

శ్యామల యేమీ అర్థంగాక తెల్లబోయింది.

* * *

సదానందం వాంఛించే శనివారం వచ్చింది...

పెదనాన్న తన రెండో వుత్తరానికయినా రాగలడని సదానందం తలబోశాడు. ఆఫీసులో వుండి ఆయనరాక తెలుసుకోటం కోసం యింటికి నాలుగయిదుమార్లు కబురు పంపించాడు. ప్రతీమారూ రాలేదనే జవాబు వచ్చేది.

సదానందంకు వొళ్లు మండిపోయింది. ఎదురుగా ఆ పెదనాన్న కనక వున్నపక్షంలో తన కసి కచ్చితంగా తీర్చుకొని వుండేవాడు. మరి గత్యంతరం లేక - సోమవారం నాటికి సెలవు దరఖాస్తు పడేసి: "పని యెక్కువగా వున్నప్పుడు - ఈలా సెలవు పెడితే యేలా" - అనే మాటలతో ఆఫీసరు చేత సెలవు గ్రాంటు చెయించుకొని: "ఇంత వరకూ ఏమిటో అనుకొన్నాను. నా గ్రహపాటు యేమాత్రం బాగుండలేదు. శని దేవుడు నా నెత్తిన తాండవమాడుతున్నాడు... అందువల్లనే పాతిక రూపాయల అప్పు యీ ప్రయాణం పేరుతో - నెత్తికి అంటుకొంటున్నది" - అనుకొని చీకటిపడటంతోటే యింటికి వచ్చాడు.

* * *

సదానందం, పెదనాన్న రావలసిన జనతా - పదిన్నరగంటలకు వచ్చింది; అతడు స్టేషనుకు వెళ్లి ఆయన రాకపోటంవల్ల నిరాశతో యింటికి తిరిగివచ్చి ప్రయాణసన్నాహంలో పడ్డాడు. కొంతకాలం గడిచింది. ప్రక్కయింట్లో గడియారం పన్నెండు గంటలు కొట్టింది ... "బండి రైటు టయిముకే వస్తుంది. మరో అరగంటే టయిం వుంది. నే పోతాను" అంటూ ప్రయాణమయ్యాడు సదానందం.

"కొంచెం ఆలస్యం అయినా సరే వ్యవహారం పరిష్కారం చేసుకు మరీరండి - అంది శ్యామల భర్తను సాగనంపుతూ!

"ఊ...సెలవుగూడా పెట్టానుగా! అవసరం అయితే సోమవారం మధ్యాహ్నం వరకూవుండి ... డబ్బు చేత పట్టుకొని వస్తాను -" అంటూ వీధి అరుగు దిగాడు సదానందం!

"సరి ఆలాచేయండి! డబ్బు తీసుకు రాకుండా వుత్తచేతులతో మాత్రం రాకండి. మనం చాలా యిబ్బంది పడతాం... బోలెడు - ఖర్చు చేసి వెడుతున్నారు" - శ్యామల అంది!

"ఊ" - అంటూ సదానందం ముందుకు సాగబోతూంటే హఠాత్తుగా యెక్కడనించో తుమ్ము వచ్చింది! అర్ధరాత్రి సమయం! ఎవరు తుమ్మారో యేమో! "ఆగండి ... ఎవరు తుమ్మారో" - అని శ్యామల అంటూంటే -

"అవతల టయిం దగ్గరపడుతూంది. మన గ్రహపాటు బాగుంటే వెధవ తుమ్ములేం చేస్తాయ్"—అంటూ సదానందం ముందుకు సాగిపోయాడు. శ్యామల అక్కడ ఒక్క నిమిషం నిల్చుని, తలుపు వేసుకొని యింట్లోకి వెళ్లిపోయింది.

 

# గ్రహపాటు



అర్ధరాత్రి నిద్రలేకుండా ప్రయాణం చేసిన సదానందం - బద్ధకంతో మర్నాడు-అంటే ఆదివారం పదకొండు గంటలకు అతడి పెదనాన్నగారింటికి చేరుకొన్నాడు. ఏమిటేమిటో పెదనాన్నను అడగాలని కోపంతో యింట్లో ప్రవేశించిన సదానందానికి, అతగాడి పెద్దమ్మ కన్పించింది. ఆవిడ ఆప్యాయతతో: "ఏం నాయనా! ఇంటిదగ్గరనుంచేనా రావటం? అంతా క్షేమమేనా?"—అని అడిగింది!

విసిగివున్న సదానందం, ఆవిడ మాటలను, అంతగా పట్టించుకొనకుండా జవాబిచ్చి: "అడగటంతో టే, అవసరాని కిచ్చావని అభిమానం అయినా వుంచకుండా పెదనాన్న నన్నీ విధంగా బాధపెడుతున్నాడు. అప్పులవాళ్లు పీక్కుతింటూంటే రెండు వుత్తరాలు వ్రాశాను. ఆయన బయలుదేరి రాలేదు సరిగదా ఒక్క వుత్తరానికీ జవాబయినా యివ్వలేదు"—అని, తీవ్రంగా అంటూంటే, ఆవిడ తెల్లబోతూ:—"అదేమిటి నాయనా అలా అంటావ్? తల తాకట్టు పెట్టుకొని, డబ్బు సర్దుబాటు చేసుకు - మీ పెదనాన్నగారు - అక్కడికి నీకోసం బయలుదేరివస్తే-నిన్న మధ్యాహ్నం జనతా దాటిపోతే - దాని తరువాత బండికి బయలుదేరి వెళ్ళారు. ఏదో అవసరానికి నువ్వు ఆదుకొన్న సంగతి మాకు మాత్రం తెలియదా నాయనా? మాకూ అభిమానం వుంది! ఆకారణంచేతనే - ఒక్కగా - ఆ వొక్క వుత్తరముకూ అందటంతోటే- ఆయన సొమ్ము చూసుకొని బయలుదేరారు...నువ్వు మాత్రం - మంచి చెడ్డలు గుర్తించకుండా నిష్ఠూరంగా మాటాడుతున్నావ్ —" అంది.

"ఒక్క వుత్తరమే అందిందన్నమాట" - అంటూ చేసేదిలేక తెల్లబోయాడు సదానందం!

"అవున్నాయనా! మీ కష్టసుఖాలు మాకు మాత్రం తెలియవా? ఇక...సరేలే.... వంటయిపోయింది. నిద్రలేక అలసివచ్చావ్. ...లే" - అందావిడ వంటగదివయిపు వెళ్ళబోతూ!

సదానందం ఆలోచిస్తూ: "నే నాయనకోసం బయలుదేరివచ్చాను. ఆయన అక్కడికి వెళ్లాడు. ఎప్పుడు వస్తాడో యేమో-" అన్నాడు. "బాకీ మొత్తం నీ చేతికిచ్చి, రసీదు చేత పట్టుకొనిగాని, మీ పెదనాన్న రానన్నారు. అంగువల్ల నీవు తిరిగి వెళ్లేదాకా ఆయన అక్కడే వుంటారు-"అందావిడ!

సదానందం గడియారంవంక ఒకమారు చూసుకొని "మరోగంటకే జనతా బయలుదేరుతుందన్నమాట. పెద్దమ్మా! నేదానికి పోతాను-" అంటూ నీళ్లు పోసుకోటం సంగతి మరచి భోజనానికి బయలుదేరి వెళ్లాడు.

* * * *

ఇక—

సదానందం యింటిదగ్గర—

అతగాడికోసం, అతడి పెదనాన్న సూర్యప్రకాశంగారు - తెల్లవారితే ఆదివారం అనగా - అయిదుగంటలవేళ, యింటికి వచ్చాడు. వస్తూనే ఆయన! "జనతా దాటిపోయింది. దానిమీదయితే రాత్రే చేరుకొనేవాడ్ని. తరువాత బండి లంఖణాలది; పైగా లేటు ఇప్పటి కీడ్చుకొచ్చింది-" అన్నాడు.

గౌరవంగా శ్యామల యోగక్షేమం చేసింది...

తదనంతరం, ఆయన: "ఇంతకీ అబ్బాయి యేడీ? పెద్దవాడ్ని అనే గౌరవం అయినా వుంచకుండా తీవ్రంగా వుత్తరం వ్రాశాడు! నన్ను యింతక్రితం డబ్బు అడిగిందయినా లేదు. ఒక్కగా ఒక్క కార్డుముక్క వ్రాసి, వుత్తరానికి జవాబివ్వలేదనే నింద మీద పడేశాడు. లెక్క యిచ్చి నోటు తీసుకుపోదామని వచ్చాను" అన్నాడు.

శ్యామలవదనం వెలవెలబోయింది: "ఆయన అక్కడికి మీకోసం బయలుదేరి వచ్చారు మామగారూ! ఒకళ్ల రాకపోకలు మరొకళ్లకు తెలియవన్నమాట. అప్పులవాళ్ల వత్తిడి యెక్కువగా వుండటంవల్ల మీకు రెండు కార్డులు వ్రాశారు; మీకు ఒకటే అందింది కాబోలు. నిన్నరాత్రి జనతాకు మీరు రానందువల్ల, మీదగ్గర లెఖ్ఖ తీసుకొని మరీ వస్తానని వెళ్లారు. రేపు సెలవుకూడా పెట్టారు. మీకోసం ఆయన అక్కడ తప్పకుండా కనిపెట్టుకు వుంటారు-" ఆమె యేలాగో అంది!

"బాగుంది! మరయితే నే యిక్కడెందుకూ? తొమ్మిది గంటలకేదో బండి వుందటగా దానికి పోతాను...రాత్రి ఏదో వేళకు యింటికి చేరుకుంటాను" అని ఆయన అప్పటి కప్పుడే ప్రయాణమవబోయాడు.

"అయ్యో భోజనం చేయకుండానే" - అంది శ్యామల.

"భోజనం యిప్పుడేలా సాగుతుందమ్మా! వస్తాను" - అంటూ ఆయన వెళ్లిపోయాడు.

"అయ్యో అంతా మా గ్రహపాటు! శనిదేవుడు మా నెత్తిని తన్నుతున్నాడు. ఆయన కోసం యీయన వెడితే; ఆయన యిక్కడకు వచ్చారు" - అనుకొంది శ్యామల.

* * *

ఆదివారం రాత్రి పన్నెండున్నర గంటలకు—

అప్పుడే లేటుగా వచ్చిన జనతా దిగి యింటికి వచ్చాడు సదానందం. అతడు యింటికి వస్తూనే, బద్ధకాన్ని, మూలకు నెట్టుతూ, భార్యతో: "మా పెదనాన్న వచ్చాడా? - వున్నాడా?" అని అడిగాడు.

శ్యామల తెల్లబోతూ: "రానూ వచ్చారు! వెళ్లనూ వెళ్ళారు. మీ రాయన్ను కలుసుకోలేదన్నమాట - అంతా మన గ్రహపాటు! మీ రక్కడే వుంటారంటే, ఆయన వెంటనే బయలుదేరి వెళ్లారు. అంతా ఆ శనిదేవుడి చలవ. ఆయన తలుచుకుంటే అంటేదికూడా అంటకుండా పోతుంది... పైగా...ఆయన మనల్ని నానా చివాట్లూ వేశారు."

"ఎందుకూ."

"వాళ్లకొక వుత్తరమే అందిందట. దానికే ఆయన లెక్క చూసుకొని బయలుదేరి వచ్చారట. మీరు వుత్తరంలో వ్రాసిన విషయాలు ఆయనకు మిక్కిలి కోపం తెప్పించాయి... "పెద్దవాడిననే గౌరవం అయినా వుంచలేదు" - అని ఆయన బాధపడ్డారు...ఏమయితేనేం...డబ్బు చేతిలో పడలేదు....అంది శ్యామల.

"అంతే కాదు...అయినవాళ్ల ఆగ్రహం కూడా పొందాం...మన గ్రహపాటు యేం బాగుండలేదు. ఇంతకీ ఆ వుత్తరం... మొదట వ్రాసింది యేమయిందంటావ్?" - అని అడిగాడు సదానందం!

"ఏమో మరి. అబ్బాయికి వుత్తరం పోస్టులో పడేయమని యిచ్చాను" - అని శ్యామల అంటూంటే—

మేల్కొని అన్నిమాటలూ వింటున్న వాళ్ళ అబ్బాయ్ గట్టిగా ముసుగుతన్నాడు!

"ఏమయితేనేం. అంతా మన పొరపాటూ, గ్రహపాటూను" - అంటూ మంచంమీద వొరిగాడు సదానందం. ★




# పొదుపు పత్రాలు

పొదుపుగా జీవించటమొక కళ. పొదుపుగా జీవించటానికీ మితముగా ఉండటానికీ సన్నిహిత సంబంధము ఉన్నది; కాని - రెండూ ఒకటి కాదు. మితమంటే స్వల్పమన్న అర్థములో మనము వాడుతున్నాము. 'పరిమితి కలిగి ఉండటము' అని కూడా అర్థము చెప్పుకోవచ్చు. జీవితాన్ని కొన్ని పరిమితులలో బంధించటమే మితముగా జీవించటము. మితముగా జీవించటానికి అవధు లేర్పరచుకొంటే, ఆ అవధులలో పొదుపుగా జీవించవచ్చు. అప్పుడుగాని పొదుపు అన్నమాటకు సరియైన విలువ ఉండదు.

పొదుపుగా జీవించటమంటే అవసరాలను తగ్గించుకోవటమనిగాని, అవసరాలను మానుకోవటమనిగాని, అర్థము చేసుకోకూడదు. అవసరాలను గడుపుకోవటములో జాగ్రత్తగా, కనిపెట్టి మసలుకోవటమన్నమాట.

పొదుపుగా వాడుకోవటము ధనానికి సంబంధించినదీ - ధనము వెచ్చించికొనే వస్తువులకు సంబంధించినదీను.

మానవుడికి కావలసినవాటిలో కడుపునిండా ఆహారము, ఒంటినిండా వస్త్రము ప్రధానమైనవి. దేహముయొక్క పెరుగుదలకూ, శక్తిని నిలపటానికీ పుష్టికరమైన ఆహారము అవసరము. ఆ విధముగానే దేహాన్ని రక్షించుకోవటానికి జాతి నాగరికత ననుసరించి వస్త్రాలు అవసరము. ఇవి రెండూ స్థితిగతుల ననుసరించి తరతమ భేదాలతో మానవులందరికీ అవసరమే.

ఈ ముఖ్యమైన అవసరాల ననుసరించి పొదుపుగా జీవించటాన్ని గురించే ప్రస్తుతము అందరి దృష్టి కేంద్రీకరింపబడి ఉన్నది.

ఇల్లిందల సరస్వతీదేవి

“జీవితావసరాలకు తగినట్టుగా పొదుపుగా ఆదాయాన్ని వ్యయము చేసుకోండి. పొదుపుగా జీవించటము నేర్చుకొంటేగాని నిలువ చేసుకోలేరు. ఇప్పుడు నిలువ చేసుకొంటే, పిల్లల పెళ్లిళ్లకు, చదువులకు, వృద్ధాప్యములో మీకు ఆ ధనము అక్కరకు వస్తుంది” అని భారత ప్రభుత్వము ప్రజానీకాన్ని పదేపదే హెచ్చరిస్తున్నది.

“మాకు వీలుగా ఉన్నప్పుడే - వీలుగా ఉన్నంతే నిలువ చేసుకుంటాము” అని ప్రజలు అంటారని ప్రభుత్వానికి తెలుసు. “పిల్లల వివాహాలకని, చదువులకని నిలువ చేసుకొన్న ధనముతో పొదుపు పత్రాలను ప్రభుత్వముదగ్గర కొనండి. మీకు అవసరము వచ్చినప్పుడు వాటిని మార్చుకోవచ్చు. 5 సంవత్సరాలవి, 10 సంవత్సరాలవి, 15 సంవత్సరాలవి పొదుపు పత్రాలను కొంటే గడువుకాలము పూర్తికాగానే, వడ్డీతో కూడా, మీ ధనము మీకు చేరుతుంది. ఈ లోగా ఆ ధనము దేశసౌభాగ్యాన్ని అభివృద్ధిపరచే ప్రణాళికలో ప్రాజెక్టులు వైద్యాలయాలు శిశుకేంద్రాలు సంక్షేమకేంద్రాలు విద్యాలయాలు మొదలైనవాటిక్రింద వినియోగింపబడుతుంది. ఈ విధముగా సహకరిస్తే మన దేశసౌభాగ్యాన్ని మనమే ఇనుమడింపజేసుకొన్నవారమవుతాము” అని బాధ్యతగల అధికారులు ప్రజలకు బోధిస్తున్నారు.

‘మా ఆదాయము మాకే చాలదు’ అనే తరగతి మన దేశములో అధిక సంఖ్యలో ఉన్నది. “మన దేశములో సగటున సంవత్సరానికి 300 రూ. లోపుగా ఆదాయముగల వారే ఎక్కువ. బొటాబొటిగా తమ అవసరాలను గడుపుకొనే వారికి కాదు ఈ విజ్ఞప్తి. అంతకు మించిన ఆదాయము కలవారికే” అని జూను నెల 23 వ తేదీన మహిళలకు ప్రత్యేకముగా ఆంధ్ర గవర్నరు శ్రీ సి. యమ్. త్రివేది విజ్ఞప్తి చేశారు.

సంపాదించేది పురుషుడు. దానిని కుటుంబముక్రింద వ్యయము చేసేది స్త్రీ

 

# పొదుపు పత్రాలు



ముఖ్యమైన అవసరాలకు పోగా మిగిలిన ఆదాయాన్ని ప్రతి కుటుంబీకుడూ నిలువ చేసుకోవాలనే చూస్తాడు. ఆ చేయటములో కొంత భాగము స్త్రీల నగలక్రింద పట్టు జరీచీరెలక్రింద వ్యయమవుతునే ఉంటుంది. ఆంధ్రరాష్ట్రములో ప్రతి సంవత్సరము సుమారు అయిదున్నరకోట్ల రూపాయలు నగలక్రింద బంగారము, వెండి, వజ్రాలను కొనటములో, స్త్రీలు వ్యయము చేస్తున్నారని తేలింది.

స్త్రీలు సౌందర్యోపాసకులు. రంగు రంగులలో జిగజిగ మెరిసే నూత్న వస్త్రాల తోను, మిలమిల మెరిసే రత్నాభరణాల తోను అలంకరించుకొని, తమ సౌందర్యాన్ని ఇనుమడింప చేసుకోవాలని చూస్తూ ఉంటారు. 'మీరు నగలక్రింద చీరెలక్రింద వ్యయముచేసే ధనములో కొంత భాగము, దేశాభ్యుదయానికై ఏర్పడిన ప్రణాళికలకు, వినియోగించేటట్టుగా పొదుపు పత్రాలను కొనండి' అంటున్నారు శ్రీ త్రివేది.

"ఈ పొదుపుపత్రాలనే అల్లుళ్ళకు కట్నాలక్రింద కోడళ్లకు నగలక్రింద చదివించండి" అని మహిళలకు ప్రబోధించారు. 'ఈ పత్రాలను చదివిస్తే వాళ్ళకు అసలు కట్నాలే కాకుండా వడ్డీకూడా గడువు కాలము కాగానే ముట్టుతుంది.' అని దానిలోఉన్న లాభాన్ని కూడా వివరించారు.

'ప్రణాళికలకొరకు ధనము కావలెనని ఈ పొదుపు ఉద్యమాన్ని ప్రారంభించలేదు. ప్రజలు పొదుపుగా జీవించటము నేర్చుకోవటము మంచిది. అది అభ్యసించవలసిన కళ' అన్నారు ఆంధ్ర గవర్నరు.

ఆదాయాన్ని కనిపెట్టి పొదుపుగా వాడుకొంటేనే గాని నిలువకు అవకాశములేదు. పొదుపుకు వ్యతిరేకార్థ మిచ్చేది దుబారాతనము.

'కూటికి వస్తుందా గుడ్డకు వస్తుందా ఇది' అన్న మాట మన కందరికీ తెలిసిందే. ఏ పని గాని కూటికీ గుడ్డకూ రానిదంతా దుబారా క్రింద లెక్క; అంటే అనవసరమైన ఖర్చులు చేయటమన్న మాట. ఉబుసుపోక పదిమంది ఒకచోట చేరటము, పదిమంది పది పనులు ఖర్చుచేసి, సినిమాలు, విందులు పార్టీలతో వినోదకాలక్షేపము చేయటము పై మధ్య తరగతి కుటుంబాలలోను పై తరగతి కుటుంబాలలోను ఉన్న అలవాటే. పది కుటుంబాలు ఒక సెలవురోజున పిక్‌నిక్ పార్టీ పెట్టుకొని పది కార్లను బయలుదేరదీస్తే ఎంత ఖర్చవుతుందో లెక్క చూసుకుంటే దుబారా అన్నమాట అర్థమవుతుంది.

కలవారి ఇండ్లల్లో పిల్లల జన్మదినోత్సవాలు పేదవారి యింట్లో పెండ్లి ఖర్చంత ఉంటుంది. ఉపనయనాలకూ పెండ్లిండ్లకు లెక్కకురాని ఖర్చులు అపరిమితము.

లేనిపోని ఖర్చులు చేయటమే దుబారా కాదు - అవసరమైన ఖర్చులలో మితము తప్పి వ్యయము చేయటముకూడా దుబారా క్రిందకే వస్తుంది.

ఒక్కొక్క యింట్లో తిన్నంత వృధాగా పోతేగాని తృప్తిగా ఉండదు. ప్రతి నిత్యమూ కావలసినదానికంటె అధికముగా వండి పారవేసుకోవటము కూడా ఉంటుంది. ఆహారధాన్యాలు, వండినపదార్థాలు జాగ్రత్తగా భద్రపరచకపోవటమువల్ల కూడా కొన్ని యిళ్లల్లో అధిక వ్యయ మవుతూ ఉంటుంది. ఈ దినము వాడిన సబ్బుబిళ్ళ రేపటికి కనబడదు - అది బావిదగ్గరే పడవెయ్యటమువల్ల కాకులు ఎత్తుకొని పోవటమో - లేక బావిలో పడిపోవటమో జరుగుతునే ఉంటుంది. ఆ మరునాడు మరొకటి కొని తెచ్చుకోవటమయినా, లేక సబ్బు లేకుండానే స్నానము చేయటమయినా, జరగవలసిందే. అజాగ్రత్తగా గారిలో కొబ్బరినూనె సీసా పెట్టటమువల్ల ఏ పిల్లకాలికో తగిలి, అర్ధసేరునూనె పోవటమూ సీసా పగలటమూ, ఇలాగే నెయ్యి, నూనె ఒలికిపోయినందువల్ల తిరిగితిరిగి కొనుక్కోవలసిన అవసరము ఏర్పడుతూ ఉంటుంది. ఇళ్లల్లో ఇలాంటి దృష్టాంతాలు అనేకము.

కొంతమందికి కంటికి కనబడిన వస్తువు - అది కొన్నాళ్లే ఉండే దయినప్పటికీ కొనాలనిపించి, వెంటనే కొనేస్తారు. డబ్బు కంటికి కనబడితే చీరెలు రవికలు కొనే అలవాటు కొందరికి ఉంటుంది. పెట్టెల కొద్దీ చీరెలూ, రవికలు కొనుక్కొని వాటిని ధరించటములోను, నలుగురికీ చూపటములోను కొందరి కెంతో తృప్తి. వాటిని ఎంతో జాగ్రత్తగా కాపాడుకుంటూ కాలక్షేపము చేస్తారు. కాని కొందరికి కొనటము మాత్రమే బాగా తెలుసు. పెద్దపెద్ద జరీ చీరెలు, పట్టుచీరెలు వందల కొద్దీ రూపాయలుపోసి కొనటము, నాలుగు సార్లు కట్టుకొని చాకలికి వేయటము, రంగు పోయిందనో - వెడల్పు తగ్గిపోయినదనో అవతల పడవెయ్యటము సామాన్యము. ఈ సందర్భములో మితానికీ పొదుపుకూ ఉన్న భేదము మనకు బాగా బోధపడుతుంది. మితముగా కొన్నట్లయితే వాటిని పొదుపుగా వాడుకొంటాము. అల్ప సంఖ్యలోఉన్న చీరెలకు రంగుపోతే మరో రంగు వేయించి ఉపయోగపరచుకొంటాము. వెడల్పు తగ్గిపోతే వాటిని మరొక విధముగా ఉపయోగించటానికి ప్రయత్నిస్తాము. వెడల్పు తగ్గిపోయిన చీరెలను జాకెట్లు, గౌనులు, పరికిణీలు, రవికలుగా ఉపయోగించవచ్చు. చినిగిపోయిన చీరెలలో, బాగా ఉన్న భాగాలను కత్తిరించి, కిటికీలకు, దరవాజాలకు, కొత్తబట్ట కొనకుండా, పరదాలను కుట్టుకోవచ్చు. డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు ఫెదర్స్ అండు స్టోన్సులో చెప్పినట్లు ఒక పాత ధోవతిని రెండు లుంగీలుగామార్చవచ్చు; పాతలుంగీని రెండుతుండు గుడ్డలుగా మార్చవచ్చు; అదీ పాతదయితే రెండు జేబురుమాళ్లు చేయవచ్చు. కాని, సంఖ్య అపరిమితమయితే ఇంత శ్రద్ధ కనబరచటము సాధ్యముకాకపోవచ్చు.

ఆ విధముగానే ఎదిగే పిల్లలకు డజన్లకొద్దీ బట్టలు కుట్టించేవారున్నారు. బట్టలు కొత్తగా ఉండగానే పిల్లలు ఎదుగుతారు కనుక అవి చాలవు. తిరిగి వెంటనే కుట్టించవలసిన అవసరము కలుగుతుంది.

జీవితములో ఆడంబరము, డంబము వాళ్ళనే కాకుండా ఎదటివాళ్ళను కూడా చెరుస్తూ ఉంటాయి. నిరాడంబరము, పొదుపు వాళ్ళనే కాకుండా ఎదటివారిని కూడా బాగుపరుస్తూ ఉంటాయి. ఇదే శ్రీ త్రివేదీగారు 'పొదుపుగా జీవించటము అందరూ నేర్చుకోవలసినద'ని అనటములో ఉన్న అంతరార్థము.

పురుషుడు తన పరాక్రమముతో లోకములో స్థావర మేర్పరచుకోవాలని చూస్తే స్త్రీ త్యాగశక్తితో స్థావర మేర్పరచుకోవాలని చూస్తుంది. ఈ భావమే మనకు కుటుంబ జీవనములో కూడా కనబడుతుంది. ఈ త్యాగశక్తినే విస్తరింపచేసి మాతృదేశము కొరకు వినియోగించటమువల్ల జీవితాలు పావనమవుతాయి.

భారతదేశములో సహాయనిరాకరణ సత్యాగ్రహోద్యమాల కాలములలో స్త్రీలత్యాగము గర్వించతగినది. ప్రస్తుతపరిస్థితులలో పంచవర్ష ప్రణాళికలో స్త్రీల కార్యక్రమాలలో అనేకమంది స్త్రీలు పాటుపడుతున్నారు. అన్నిటికంటె ప్రధానమైన అంశము ఈ ప్రణాళికకు కావలసిన కోట్లకొలది రూపాయలను ఈ పొదుపుపత్రాలద్వారా స్త్రీలే

వనితాలోకం:

# "వరుడు - కావలెను"

ఆ రోజు దినపత్రిక తన దక్షిణహస్తంలో ఎగిరి పడుతూవుండగా తలుపు తీసి నన్ను లోపలికి ఆహ్వానించింది కమల. కోటుతీసి వంకిన తగిలించి ఆ పైన వాలు కుర్చీలో వాలిపోయి బూట్లు విప్పుకుంటూ వుండగా కమల అన్నది—

"విశేషాలు యేమిటో చెప్పండి... చూతాము" అని. కమలవంక ఆశ్చర్యంగా చూశాను. సామాన్యవిషయాలను గురించి కమల ఎప్పుడూ అంతగా పట్టించుకోదు. ఆమెగారి మనస్సునూ, వుత్సాహాన్నీ కైవసం చేసుకున్న అంతటి అపురూపమైన సమాచారం ఆ రోజు పేపర్లో ఎక్కడా నాకు తగలలేదు. ప్రశ్న అంటూ వకటి పుట్టించినతరువాత ప్రత్యుత్తరం చెప్పటం బుధజన సమ్మతం కాబట్టి వెంటనే అన్నాను.

"ఆఁ యేమున్నాయీ... రంగాగారిపై రాజాగారి విజయమూ, డ్రోబనీపై కృష్ణన్ గెలుపూ...మరేమీ—"

"అవికావులెండి...మీకు యెప్పుడూ స్పోర్ట్సు గొడవే" అన్నది కమల నవ్వుతూ.

"ఆఁ ఏమన్నావూ రాజాగారి విజయమూ స్పోర్ట్సేనంటావా..." అన్నాను కుస్సుందు వెదికి.

"కాక...అది ఎంత స్పోర్టివ్‌గా వుందో గ్రహించారా" అన్నది కమల నిస్సంకోచంగా.

"ఆ సంగతి యిప్పుడు దేనికిలే...యింతకీ నీకు నచ్చిన వార్త చెప్పావేకావూ..." అన్నాను వెనుకటి విషయం గుర్తుకుతెస్తూ.

"నేను చెప్తే మీకు కోపంవస్తుంది. ఆ తరవాత పెద్దా పిన్నా తారతమ్యం లేకుండా అపహాస్యమూ అని కేకలేస్తారు. నాకెందుకు బాబూ మీరే చూసుకోండి" అంటూనే

గొల్లపూడి కేశవరావు

పత్రిక రెండో పేజీ తెరిచి చేతికి యిచ్చింది కమల. ఆతరువాత అన్నది—

"అదుగో 'వరుడు కావలెనూ అని వున్న ప్రకటన చదువుకోండి" అని నవ్వుతూ. ప్రకటన చూసి విస్తుపోయాను. సర్వసర్వత్రా యిటువంటి ప్రకటనలకింద పంపినవారి చిరునామా వుండదు. అంతే కాక వుత్తరప్రత్యుత్తరాలు అతిగోప్యంగా వుంచుతామనే ఒక అంశం ఆ ప్రకటనలో ఒక ముఖ్యభాగమయివుంటుంది సర్వసాధారణంగా. అందుకు భిన్నంగా యీ ప్రకటనకింద పంపినవారి పేరు వున్నది. అంతకుమించి వింతకలిగించే సంగతి యేమిటంటే ఆ పేరు మా బెజవాడ బాబాయిది!

"ఏమిటి బాబాయే ఈ ప్రకటన చేశాడా కమలా" అన్నాను నేను ఆశ్చర్యపోతూ.

"అద్దమూ మొహమూ రెండూ వున్నాయి. మధ్య నా వివరణతో పనేముంది" అన్నది కమల నవ్వుదాచుకుంటూ.

కామేశ్వరి కాలేజీలో చదువుతూవుంది.

అందుకు కారణం కట్నం వుండదని మా బాబాయికి ఒక అపోహ వుండటం మాత్రమే.

"చదువుకున్న పిల్లగదా...కట్నం అవీ లేకుండా" అన్నాను నేను అర్థోక్తిలో.

అందుకు కమల ఎంతమాత్రం తప్పుకోలేదు.

"మీ కామేశ్వరికి వరుడు చదువుకున్నవాడే అవాలిగదా" అన్నది కమల.

"అందుకు సందేహమా" అన్నాను.

"అతనూ యే బి.ఏ. వో ఎమ్.ఏ. వో పాసయి వుండాలి. అహాఁ...చదువుకున్న పిల్లను తీసుకుపోయి కాళిదాసుకు కట్టబెట్టం కదా" అన్నది కమల.

అయితే ఒక్కమాట.....పెళ్ళి అయే వరకూ కాళిదాసు వుత్త మూర్ఖుడని కమల ఏదో పుస్తకంలో చదివింది.

"అవును...ఆ మాటా నిజమే."

"ఇకనేం......చినమావగారు పప్పులో కాలువేశారు. పదివేలన్నా క్షేత్రపుచ్చుకుంటే కాని కామేశ్వరిని కన్యాదానం చెయ్యటం అవదు" అన్నది కమల తీరిగ్గా నవ్వి.

"ఏమీ...ఎందుచేత" అని అడిగాను.

"మావగారు అమాయకులు. చదువుకున్న కామేశ్వరికి చవకగా మొగుడు దొరుకుతాడనే మురిసిపోతున్నారుగాని చదివినవరుడు తన విద్యకైన విత్తమంతా అత్తగారిసొత్తుతో పూడ్చుకోవచ్చుననే ధీమాతో వుంటాడనే విషయం ఆయనకి తెలియదనుకుంటాను"

"అయితే చదువుకున్నవాళ్ళంతా కట్నాలకోసమే చదువుతున్నారంటావా...వాళ్ళకి ఆదర్శాలు వున్నాయనీ..."

కమల నన్ను మాట్లాడనివ్వకుండానే అన్నది - "చూడండి మీరు ప్లీడరీ చేస్తూనే వున్నారాయెను. ఆదర్శానికి అవకాశానికి తేడా తెలుసుకోగలరుగదా.

కమల యీవిధంగా చెప్పటం నాకు ఓ ఘాత కలిగించింది. చొక్కా కాలరు సరిచేసుకుంటూ కొంచెం కోపంతో అన్నాను.

"నా ప్లీడరీతో పనేముందీ ... అడిగిన ప్రశ్నకి అవునూ, కాదూ అని సమాధానం చెప్పేదానికి, యీ ఆదర్శాల గొడవ ఎందుకు"

"బోనులో ఎక్కి కటకటాలమధ్య యిరుక్కున్నవాళ్ళయితే ఆవిధంగా చిలకపలుకులు పలుకులుతారు. నాకేమీ -"

"అవును వనవిహంగానివి" అన్నాను నేను. కమల నవ్వింది పున్నమనాటి వెన్నెలలా.

ఆతరువాత అన్నది -

"చూడండి. ఈకాలం యువకులు

(30 వ పేజీ చూడండి)

సమకూర్చిపెట్టవలెనని ప్రభుత్వము మహిళలనే నియోగించటము. ఈ గురుతరబాధ్యతను స్త్రీలు చక్కగా నిర్వహించగలరని ప్రభుత్వము ఆశిస్తున్నది.

రెండవపంచవర్ష ప్రణాళికలో అరవైలక్షుల మందికి అదనంగా ఉద్యోగాలు కల్పించటానికి, ప్రజల జీవనప్రమాణాన్ని పెంపొందించటానికి కృషి జరుగుతుంది. ఈ ప్రణాళికకు 5600 కోట్ల రూపాయలు ఖర్చు కాగలదని అంచనా వేయబడ్డది. మొదటి ప్రణాళికా కాలములో పొదుపు మొత్తాలద్వారా 245 కోట్ల రూపాయలు రాగలవని అంచటము జరిగింది. రెండవ ప్రణాళికాకాలములో 400 కోట్లవరకూ పొదుపు మొత్తాల వల్ల వసూలు కావలెనని నిర్ణయించటానికి వీలున్నదని ప్రభుత్వము విశ్వసిస్తున్నది.

స్త్రీలు తలచుకొంటే ఇది ఏమంత ఘనకార్యము కాదు. స్వదేశముకొరకు ఎవరికి చేతనయిన త్యాగము వారు చేయటము కర్తవ్యముగా భావించుకోవాలి. ధనరూపములో కొందరు త్యాగము చేయగలిగితే కొందరు శ్రమరూపములో చేయగలుగుతారు. పత్రం పుష్పం ఫలంతోయం యథాశక్తి!

ఈ మహాయజ్ఞములో కవులు, గాయకులు, రచయితలు, చిత్రకారులు, శిల్పులు, నటులు, ఉద్యోగులు, గృహిణులు, పిల్లలు జాతి మత వివక్షతలేకుండా, తమ శక్తిసామర్థ్యాలవిశేషముతో పాల్గొని దీనిని విజయవంతము చేయగలరని ఆశిద్దాము.

★



"నోరెత్తిహోరెత్తి సాగులుసాగరము" (శ్రీ శ్రీ)



ఫొటో: పి. సి. ఎస్. ఈశ్వరబాబు—మద్రాసు.

చదువుకోవటం కట్నంకోసమని నేను అనటంలేదు. వారి ఆదర్శం వెయ్యిసిఖ్ఖా నాణాలబత్తెంమీద నిహజూరు వారి దర్బారులో దివాన్గిరీ చెలాయించటం కావచ్చు. కల్చరల్ మిషన్ పనిమీద కాన్‌స్టాంటినోపిల్లో, నేపిల్స్లో పోవటం అవవచ్చు. అయితే కోరి పిల్లనిస్తానూ అని వచ్చిన కాబోయేమామగారిముందు విశ్వవిద్యాలయంవారిచ్చిన పత్రాలు కుప్పలుతిప్పలుగా పడేసినా విలువ యిదీ...యిహ మీ తిప్పలు మీరుపడండీ అని యీ అవకాశం అంది పుచ్చుకొని తనకు తనే ధరకట్టుకోవటం యీ రోజుల్లో అన్నిచోట్లా జరుగుతూనే వుంది."

"అవును యిందులో తప్పేముందీ. తన యింతధనమూ ధారపోసి చదివిన చదువూ, అందువల్ల తన పొందే గౌరవమూ ధనమూ తన నిమిత్తమేనంటావా—కాక కట్టుకున్న భార్యా, కలిగేసంతతికోరకూనంటావా? తనకు ఆ మాత్రం పాత్రత వుందని భావించటంలో అసహజం యేవుందీ!" అన్నాను నేను.

"ఓహోహో...యిది వినటానికైతే సొంపుగానే వున్నది. అతను చదువు పరార్థం అంటారు. అవునా...సరే వప్పుకుంటాను. అతనికి తగ్గ పాత్రతవుందన్నారు. అందుకూ సమ్మతించాను. కాని యీ స్వార్థరహితుడు తనపాత్రతకి తగ్గ ధనానికి అమ్ముడుపోవటం కేవలం అపాత్రుడి లక్షణం కాదా!" అని అడిగింది కమల.

"కట్నాల మాటా...నిజమే అది చాలా తప్పే" వప్పుకోక తప్పలేదు నాకు. అయితే కమల అందుకు ఆమోదించి వూరుకుంటే రమ్యంగా వుండేది. ఆమె మాటలనే అమ్ముల పొదినుంచి వొకవాడి తూపు నామీదే పడింది.

"ఆమాట యీనాటికైనా మీ నోట విన్నాను. మీరు పుచ్చుకున్న ఆరువేల మాటా ఆట్టేపెట్టి అలకపాన్పు మీద కోలెక్కు యివ్వలేదని ఎందుకు అంత గొడవ చేశారూ!" అని గతజలసేతుబంధనం చేసింది కమల.

ఈ పరిస్థితుల్లో నాకు విపరీతమైన వుక్రోషం కలగటంలో ఆశ్చర్యమేవుందీ. ఈ అప్రస్తుత ప్రశంసాలంకారంవల్ల ప్రతి పురుషుడూ తన అవసరంతీరిన తరువాత గాని సంస్కర్త అవలేడని కమల భావన కావచ్చు. వాస్తవానికి అందులో కొంత సత్యం వుండవచ్చు. ఇది పూర్తిగా నా వ్యక్తిత్వాన్ని అపహసించే ములుకులాంటి పలుకు. నిజానికి వొకనాడు నేను నా అంతరాత్మకి ద్రోహం చేసివుండవచ్చు. అందుకు నేను తరువాత నామనస్సులో ఎంతో బాధపడి ఆ సంతాపంవల్ల తృప్తిపడివున్నాను. అయినా కాకపోయినా నువ్వు చేసింది తప్పే అయినా నీవు తప్పు చేశావని ప్రతివాడూ తడవ తడవకీ నీకు జ్ఞాపకం చెయ్యవలసిన అవసరం ఎంత మాత్రమూ లేదు. తద్వారా అతడు నిన్ను నీచంగా చూడటమేకాక నువ్వు నీచుడవని నీకు గుర్తు చెయ్యటమే అవుతుంది. ఆత్మాభిమానం వున్న వాడెవ్వడూ దీన్ని హర్షించలేడు సరిగదా, ఆ సమయంలో అవతల వాడిమీద యిదివరలో నీకు వున్న గౌరవమూ అభిమానమూ ఒక్కసారిగా తరిగి పోవటం జరగవచ్చు.

"ఇదే మరి వకరివిషయంలో అయితే చేసినతప్పుకు మనస్ఫూర్తిగా క్షమాపణ చెప్పను నేవాడిని. కాని యీ గోట్లాడ కొట్టి పుచ్చుకోవటం...యితరుల్ని దోచుకు తినే ఓ సబ్‌రిజిష్ట్రారుగారిదగ్గిర్నుంచి. అందుకు నేను యేనాడూ విచారపడను. ఇను మిక్కిలి ఆనందిస్తాను కూడాను." అన్నాను నాలో వున్న యీర్ష్య మాటలలో వదిలేస్తూ.

వేటగాడి తాలూకు విషయుక్తమైన బాణం రెక్కలమాటున గుచ్చుకున్న ఆడ పావురంలా కమల నావంక చూసి అన్నది—

"అనవసరంగా మిమ్మల్ని బాధపెట్టాను...నేను అల్లా అనివుండవలసిందికాదు. కాని నావుద్దేశం అదికాదు..." అని ఆగింది కమల నావంక బాధగా చూస్తూ.

నిక్షేపమైన యీ క్షమాపణవల్ల నా కోపం పాదరసంలా జారిపోయింది.

"నన్ను అంటేమట్టుకు నాలుగూ దులుపుతాను. ఇంకెవ్వరినన్నా అను రవ్వంత కూడా చింతించను" అన్నాను నవ్వుతూ.

"అసలు చదువుకున్నవాళ్ళు అందరి మాటలూ యిల్లాగే వుంటున్నాయి. అందుకు వాళ్ళు ఏవి జవాబు చెప్తారో వినాలని కోరికగా వుంది... పోనీ మరేమంటారో, చెప్పండి."

"కమలా...నన్నో ఫూల్‌నిచేసి ఆడిద్దామని నీ వుద్దేశం అనవచ్చు. కాని యీ ఎత్తులు మనదగ్గిర సాగవు." అన్నాను పటాటోపంతో. కమల సిగ్గుపడింది...

"అది కాదు నా వుద్దేశం. అందరూ మీలాగే చేశారనీ అందుకు యిది సూత్రప్రాయంగానూ వుదాహరణంగానూ తీసుకోవటం నాకు సమ్మతంకాదు. కేవలం తెలుసుకోవాలీ అని అడుగుతున్నాను." అన్నది కమల చిన్నగా నవ్వి.

అయితే యీ సమయంలో కమలని పూర్తిగా మోసం చేయటానికే నిశ్చయించుకున్నాను. కమలకు నేను జవాబుగా చెప్పిన విషయం కేవలం అసత్యం కాదు గాని, అది పూర్తిగా సత్యంమాత్రం కాదు.

"కమలా! నీ అంద చందాలూ తెలివి తేటలూ చూసిన్నూ, మీ నాన్నగారు యిచ్చే కట్నానికి మోజుపడిన్నూ నిన్ను వలచి చేసుకున్నానని నీవు అనుకుంటే అది కేవలం పొరపాటే అవుతుంది. నాకు

స్వతహాగా సంపాదించుకోగలననే ధైర్యం కలిగేదాకా పెళ్ళి చేసుకోకూడదని అనుకున్నాను. అంతే ఎన్ని సంబంధాలు వచ్చినా నచ్చలేదని వీటో వుపయోగించాను. కొద్ది రోజుల్లోనే మా నాన్నగారికి అనుమానం కలిగింది. ఆడపిల్లల పెళ్ళి తండ్రికి భారం కావచ్చు. అదే తీరుగా పిల్లవాడి పెళ్ళి కూడా తండ్రికి బాధ్యత అని నీకు తెలుసు కదా. అయితే బాధ్యతలో కూడా కొంత భారం వుంటుందనుకుంటాను అందుకనే మా నాన్నగారు—" "ఆ బరువు దింపుకోవాలీ అని చూశారు అవునా" అన్నది కమల పరీక్షగా నావంక చూస్తూ.

"అవును. ఆరోజు నిన్ను చూడటానికి వచ్చింది నీకు గుర్తు వుందనుకుంటాను.

అసలు వాస్తవానికి ఆరోజు నేను గడ్డం చేసుకోలేదు. రోజూ రెండు పూటలా స్నానం చేసేవాడిని ఆరోజు సాయంత్రం స్నానం మానుకున్నాను. చివరికి క్రాపు దువ్వుకోకుండా దుబ్బలా వుంచుకొని వస్తావుంటే చివరికి అలంకారాలంటే గిట్టని మా నాయనమ్మ కూడా "ఏమి వేషంరా... అది" అంది. ఆవిడగారే అసహ్యించుకున్న యీ రూపుకు ఆ వధువు అసహ్యించుకుని వరుడు నచ్చలేదని అనకపోతుందా అని నా వూహ—"

"అవును తొలిచూపులోనే అనుకున్నాను మీరు భావుకులని"

ఈ మాటలు పూర్తిచేసి కమల కలకలా నవ్వింది సెలయేరులాగా.

"కావచ్చు ఆ అనుకోవటమూ నీ నవ్వూ కొంప ముంచాయి కొసకి. ఆదర్శానికి తిలోదకాలు యిమ్మని మనస్సు కోరినా క్షణం యోచించి "నాకు నచ్చలేదు" అన్నాను మా నాన్నతో—"

కమల వుత్సాహంతో నావంక చూసింది. ఆమె దృష్టిలో యీ కథ యీ సమయంలోనే రక్తికట్టుతోంది గావల్ను.

"మా నాన్నగారు చాలా బాధపడ్డారు. నీకు నచ్చే పిల్ల యిహ దొరకదూ అన్నారు. ఆతరువాత ఆయన సరిగ్గా భోజనం చెయ్యటం తగ్గించుకున్నారు. ఎప్పుడూ మగతగా పడుకుని వుండేవారు. ఆయన్ను చూస్తూవుంటేనూ, నీ రూపు మనస్సులో మెరుగులుతూవుంటేనూ నేను పొరపాటే చేశానేమో అని బాధపడ్డాను. చివరికి లొంగక తప్పలేదు. అప్పటికి నాకు ఒక్క ఆశమాత్రం వుంది. నువ్వు అంగీకరించవనీ.. మీ నాన్నగారు కోరిన కట్నం యివ్వలేరేమోననీను...చివరికి ఆ రెండూ జరగలేదు"

"ఆతరవాత వృత్తాంతము సాంతమూ మా రామయ్య ముఖతః విన్నానులెండి. మా నాన్నగారు నాలుగువేలకి మించి దమ్మిడీ రాల్చనన్నారు. మామగారు ఎనిమిది వేల నుంచి పైసా తగ్గనన్నారు" అన్నది కమల.

"మరి నువ్వూ కొద్దో గొప్పో చదువుకున్నావు గదా - కట్నం యిచ్చే పెళ్ళి నాకు వద్దని చెప్పలేకపోయావా?" అని అడిగాను కమల ఏమంటుందో విందామని.

"మా అమ్మతో మాటవరసకి అన్నాను గాని - కాని ... అంతగట్టిగా అనలేకపోయాను" అన్నది కమల సిగ్గు నభినయిస్తూ.

అవుగాక...ఉన్నతాదర్శాలు అందరికీ వుంటవి. అయితేనేమి కొన్ని సమయాల్లో లోపలిస్వార్థమో మనసులోని దౌర్బల్యమో మనం మన ఆదర్శాలని అనుసరించనీకుండా అడ్డు తగులుతాయి. మనకు చదువు సంస్కారం తప్పకుండా యిస్తుంది. కాని మనలోని యీ మానసికదౌర్బల్యాన్ని, మనకు ప్రియమైనదానికి లొంగిపోయే చిత్తచాంచల్యాన్ని ఎదురించడానికి చదువు యిచ్చే సంస్కారం చాలదనుకుంటాను. ఆ మనోధైర్యం అలవరుచుకోవటం ఎంతైనా అవసరం. అప్పుడుగాని ఆదర్శాలకి విలువ అబ్బదు. ఇంతెందుకు ... యీరోజున మా దాంపత్యజీవితం సాఫీగా సాగిపోతున్న మాట యథార్థమే. అయితేనేమి మా ఆదర్శాలు చెల్లని రూపాయ నాణెంలా తళతళా మెరుస్తూకూడా చెలామణీకాకుండాపోయాయని బాధపడుతున్నాము.

"అవునా కమలా ... ఆదర్శాలకు వాస్తవిక జగత్తులో విలువ యింతమాత్రమని గ్రహించాము. ఈకాలపు యువకులందరూ వక్తృత్వపోటీలలో బల్లగుద్ది కట్నాలూ వగైరాలు పనికిరావని గొంతుచెడేదాకా వుపన్యాసాలు దంచేస్తున్నారు. మరి ఆ చరణంలో వచ్చేసరికి ఎందువల్ల వెనకబడుతున్నారు?"

"ఎందుకూ అందుకు జవాబుగా మా వూళ్ళో శివయ్యగారి కొడుకును చూడరాదూ...ఏమిచేశాడోనూ ..." అన్నది కమల.

ఆ విషయం సవిస్తరంగా చెప్పమన్నట్లుగా చూశాను కమలవంక.

"అతను ఎమ్.ఏ; ఎమ్.ఎల్. పాసు అయ్యాడు. పైగా తండ్రిగారికి ఒక్కడే కొడుకు. ఎంతలేదన్నా తండ్రి కొంపలార్పి సంపాదించిందే లక్షకుపైగా వుంటుంది. ఇక మామగారు ఓ పిల్లజమీందారు. ఆయనకీ లలిత ఒక్కతే కూతురు. మరి మగబిడ్డలూ లేరు. వియ్యంకుళ్లు యిద్దరూకలిసి అదేదో వ్యాపారం చేశారుట పెట్టుబడులు పెట్టి. లాభం వచ్చినంతకాలం వ్యవహారం బాగానే నడిచింది. ఆ తరువాత వ్యాపారం నష్టం వచ్చి మొదనష్టం అయిపోయింది. ఇక శివయ్యగారంటూరా డబ్బుకోసం కట్టుకున్న పెళ్ళాన్ని అయినాసరే సాక్షాత్తూ హరిశ్చంద్ర చక్రవర్తిలా నడిబజారున నిలబెట్టి అమ్మేరకం - నా పెట్టుబడి మొత్తం నాకు రావలసిందే నష్టంతోటీ అప్పులతోటీ నిమిత్తంలేదని దావా వేశాడు."

"ఛీ...యీదావా ఎల్లాసాగేడుస్తుందీ" అన్నాను నేను.

"శివయ్యకొడుకూ ఆమాటే అన్నాడుట. అప్పుడు శివయ్య రోషంతో మండిపడి నీ భార్యబోధలు విని నన్నిల్లా బెదిరిద్దామని చూస్తున్నావా...యిల్లాగయితే నా ఆస్తిలో దమ్మిడీ నీకు దక్కనివ్వను" అని బెదిరించాడుట. నిజంగా దావావిచారణకు వచ్చి గెలవటం కష్టమని తోచగానే మరి కొడుకుని బతిమిలాడాడో, భయమే పెట్టాడో తెలియదుగాని మర్నాడే కోడలు కన్నీటి

తోనూ మాటల్లోనూ, తన ముద్దు పిల్లల్ని వెంటబెట్టుకొని కన్నవారింటికి వచ్చేసింది.

"ఆం... విద్యాసాగరం యింత పని చేశాడా," అని నేను నిజంగా ఆశ్చర్యపోయాను.

"అవును. విద్యాసాగరం యింతపనీ చేశాడు. ఆ తరువాత రెండురోజుల్లోనే భాస్కరం పంతులు శివయ్య పాదపంకేరుహాలపై సాగిలపడి మొత్తం సొమ్మూ కోర్టు ఖర్చులూ చెల్లించుకొని రాజీపడ్డాడు." అన్నది కమల.

"ఇందులో రాజీ ఏముంది నా తలకాయ ...రాజీఅంటే వాదిప్రతివాదు లిద్దరికీ కొంత లాభమూ కొంత నష్టమూ—"

మాట ఆపి కమల అన్నది - "భాస్కరం పంతులికి లాభం కలగలేదని అంటారెందుకనీ. కూతురుకాపరంనిలపటం లాభమే గదా" అన్నది కమల ఉద్రేకంతో. "ఏమీ విద్యాసాగరం భార్యతో ఆ విధంగా అని వుంటాడూఅంటే నమ్మలేకుండావున్నాను. అతను నా క్లాస్‌మేటే. అతను అవసరమైతే దేనికైనా సరే త్యాగం చెయ్యగలడను కున్నాను"

"ఆ మాట నిజమే. అందుకనే ఆ ఆదర్శపురుషుడు అవసరం గుర్తించినవెంటనే ఆదర్శాల్నీ, భార్యామణినీ, తన సంతానాన్నీ కూడా శివయ్యగారి ధనం నిమిత్తం త్యాగం చేసేశాడు." అన్నది కమల అపహాసిస్తూ.

"అదికాదు కమలా! ఒక్క విషయం గురించి నేను అమితంగా బాధపడుతున్నాను. చదువుకున్నవాళ్లూ, యింగితజ్ఞానం వున్నదనుకునేవాళ్ళూ యీ విధంగా ప్రవర్తిస్తూవుంటే యిహ వాళ్ళకు బుద్ధి చెప్పేదెవరూ! ఒకవేళ శివయ్యకూతురు చదువుకున్నదైవుంటే భర్తకు బుద్ధి వచ్చేలాఏదో వకటిచేసివుండేదనుకుంటాను."

"ఆమె చదువుకున్నా యింతకు మిక్కిలి ఏమీ చేసేదికాదు." అన్నది కమల వెంటనే.

"ఏమీ ... ఎందువల్లా" అని అడిగాను.

"ఆమె చదువుకునివుంటే తన స్వశక్తి ఎరిగివుండి భర్తకు ఎదురుతిరిగేదని మీరు పొరబడుతున్నారు. ఆమె యిప్పుడేనా చెయ్యదలచుకుంటే ఆవిధంగా చేసివుండేది. ఎందుకంటే ఆమె భర్త సంపాదనమీదే బతకవలసిన ఖర్మకు లోబడిలేదు. అది అలావుంచి భర్తమీద యీ విషయం మినహాయించి తప్పు పట్టవలసిన అవసరం ఆమెకు ఏనాడూ కలగలేదు. నిజానికి అతను ఆమెని అంత మక్కువగా చూసేవాడుట!

కమల చెప్పిన యీమాట విని నాకు ఎంతో ఆశ్చర్యం కలిగింది. మానవుడిలో మంచీ చెడూ రెండూ వున్నాయి. అందులోనూ మంచే యెక్కువ అనుకుంటాను. అతను సీదాగా రాస్తావెంటనడుస్తూ వున్నంతసేపూ అతనిలోని గొప్పతనం కప్పుకుపోయే వుంటుంది. అతనిలోని యేవొక్క లోపమో బయటపడ్డనాడు మాత్రం నలుగురూ వేలెత్తి చూపుతారు. గమ్యస్థలానికి నియమిత సమయంలో చేరిన రైలుబండినిగురించి ఆలోచించేవాళ్లే వుండరు. అదే రైలు త్రోవలో పట్టాతప్పిననాడే దానికి విశేషమైన ప్రచురణ జరుగుతుంది.

"మాడండి...యింతమాత్రాన స్త్రీ భర్తకు ఎదురుతిరుగుతుందంటే నేను ఒప్పను. చదువుకున్న ఆడవాళ్లు స్త్రీసహజమైన సహనశక్తి ప్రేమానురాగాలు వదిలిపెట్టారనే వూహా, అనవసరంగా, భర్తకు విడాకులు యిచ్చి గుడిసెమీద దెబ్బకొట్టి లేచిపోతారనే అభిప్రాయమూ మీ పురుషులకి ఎల్లా కలిగిందో నాకైతే తెలియదు గాని, అది కేవలం నీటిమూటే సుమండీ" అని ఆగింది కమల. పార్లమెంటు మెంబరులాగ తొణకకుండా వుపన్యాసం యిచ్చేస్తున్న కమలనీ, ఆవిడ హావభావ విలాసాల్నీ ఆస్వాదిస్తూ- వున్న నాకు ఆ క్షణం ఒక మరపురాని యుగంలా వుండిపోయింది.

"విడాకుల చట్టంమీద నీ అభిప్రాయాలు ప్రస్తుతానికి అప్రస్తుతం. అయితే కామేశ్వరి చదువూ—" అని అర్థోక్తిలో ఆగాను.

"కామేశ్వరిని చినమావగారు వొకందుకు చదివిస్తున్నారు. కామేశ్వరి మరొకందుకు చదువుతోంది. చదువుకున్న భార్య కావాలనుకునే యువకులు మొహమాట పడకుండా కట్నం పుచ్చుకుని కూడా మరొకందుకు పెళ్లిచేసుకుంటున్నారు. వెనక వొక బుద్ధిమంతుడు అన్నాడుట— "నువ్వొకందుకు పోస్తే నే నొకందుకు తాగుతున్నానే ముసలమ్మ అని" అంటూనే గడియారం వంక చూసి వులిక్కిపడ్డది కమల.

"ఇప్పటికే చీకటి పడుతోంది. మీరటు ఆఫీసు గదిలోకి... నేనిటు వంటయింటికీ" అంటూ కమల పాకశాలలోకి మెరుగు మొయిలు సొచ్చు తెరగున చొచ్చుకుపోయింది.

## 2

ఆరోజు మూడో శనివారం. భోజనం వగైరాలు పూర్తిచేసుకొని విశ్రాంతి తీసుకుంటూ వున్నాను. కమల సావిట్లో కూర్చుని రేడియోలో సినీమాసంగీతం వింటోంది.

ఎండలు మండిపోతున్న యీ సమయంలో వినీలాకాశంనుంచి జారిపడే శబ్దపు పిడుగులాగా అసాసురుడై బాబాయి సావిట్లోకి ప్రవేశించాడు...ఖద్దరుసంచీ చంకను యిరికించుకొని.

అదిరిపడి లేచి కమల దొడ్లోకి వెళ్ళింది నీళ్ళు తెచ్చే నిమిత్తం.

బాబాయి కాళ్ళు కడుక్కొని దాహం పుచ్చుకున్నాడు. కమల సావిటి నానుకొని వున్న పడకగది తలుపు చాటుకు పోయి అన్నది..."మావగారిని భోజనానికి లెమ్మనండి" అని.

"భోజనం అయ్యే బయలుదేరానమ్మా" అన్నాడు బాబాయి పడకకుర్చీలో తాపీగా కూర్చుని.

"ఏమిరా బొత్తిగా వుత్తరాలే రాయటం మానేశావూ. కోడలు కూడా జ్ఞాపకం చెయ్యటం లేదన్న మాట" అన్నాడు బాబాయి.

"తీరికే లేదు బాబాయ్...యిహ మీ కోడలు అంటావా......వాళ్ల వాళ్లకయితే ఘుటికకో వుత్తరం రాస్తుంది" అన్నాను బాబాయి అండ చూసుకొని ధైర్యంగా.

తలుపు వెనకాల గాజులశబ్దం గలగలా వినిపించింది.

"అల్లా అనమాకు. కోడలుకే మేమంటే ఎంతో యిది" అన్నాడు బాబాయి.

"అంతా కులాసాయేగదా" అని అడిగాను. ఈ ప్రశ్న అంతిరార్థం వచ్చిన పనేమిటని.

"ఆ కులాసాయే. కామేశ్వరికి పెళ్లి చేద్దామని చూస్తున్నాను."

"అల్లాగా...సంబంధం కుదిరిందా" అని మాత్రం పూరుకున్నాను.

"పెళ్ళివారు రేపే చూపులకి వస్తారుట. ఇప్పుడు నిన్ను తీసుకుపోదామనే వస్త."

"నన్నా...నేను దేనికి బాబాయ్."

"ఒరేయ్ నాయనా...యీ విషయాలు నాకు బొత్తిగా తెలియవు. అదీగాక యిది మామూలు సంబంధాలు కావు నీకు తెలుసు అనుకుంటాను సంబంధాలకోసం చెప్పులు అరిగేదాకా తిరిగాను. చదువూ డబ్బూ వున్నవాళ్ళూ, చదువు మాత్రమే వున్నవాళ్ళూ, డబ్బు ఒక్కటే వున్నవాళ్ళూ కొసకి రెండూ లేనివాళ్ళూ అందరూ వకటై, నాలుగు వేలకి తక్కువ అయితే అసలు చూపులకే రామన్నారు. మన పరిస్థితి నీకు తెలుసుగదా. ఇహ కామేశ్వరి అంటావా... అది యీ సంవత్సరమే కాలేజీ మొదటిగా పాసు అయింది. పిల్ల అనాకారి కాదు. చూపులు అయింతరువాత కట్నం విషయం ముచ్చటిద్దామన్నా ఒక్కడూ వప్పుకోలేదు. చివరికి ప్రాణం విసుగెత్తిపోయి పేపర్లో ప్రకటించాను. మొన్ననే మూడు అప్లికేషన్లు వచ్చాయి."

బాబాయి మాటలు పూర్తిఅయీ అవక ముందే మళ్ళీ తలుపువెనకాల గాజులు గలగలలాడాయి. అంటే వాటి అర్థం కమల తలుపు చాటుచేసుకొని నవ్వుకుంటూ వుండి వుండాలి.

"ఇంటర్వ్యూ ఎప్పుడు యేర్పాటు చేశావూ" అన్నాను నేను - నవ్వుకుండా పళ్లుమాత్రం బయటకు నెట్టి.

"అందుకనే యిక్కడికి రావటం పడ్డది. రేపు యిద్దరూ ఎల్లుండి ఒకరూ దిగుతారు. అయితే యిది మామూలు పెళ్లిచూపులు కావుగదా వచ్చేవాళ్ల మాటలతీరూ, నడవడికా, వేషభాషలూ మనం జాగ్రత్తగా పరిశీలించి కామేశ్వరికి వరుడిని వారిలో నుంచి ఏరాలి. అందుకు నువ్వు వుండటం ఎంతైనా అవసరంఅనిపించింది. సాయంత్రం పాసింజరులోనే ప్రయాణం" అన్నాడు బాబాయి.

అంటే దీనిభావం సదరు యింటర్వ్యూలకి నేను అధ్యక్షస్థానం అలంకరించి ఆ భారం మన భుజస్కంధాలపై మోస్తూ వరుడిని నిర్ణయించాలన్నమాట. ఇటువంటి వుద్యోగనిర్వహణ నాకు బొత్తిగా కొత్త.

"బాబాయ్ ... యిటువంటి విషయాలు నాకు బొత్తిగా తెలియదని నీకూ తెలుసు. మీకోడలునిచేసుకోవటంలోనే నా తెలివి బయటపడుతోంది" అన్నాను. చాటున వున్న అజ్ఞాతవ్యక్తిని వుద్దేశించి.

తలుపుచాటున కమల కదలినట్లుగా అనిపించింది నాకు.

"అదేమిట్రా అల్లా అంటావు పదిమంది లోనూ తిరిగేవాడివి నీకన్నా యెందుకు తగ్గవాళ్లెవరూ!" అన్నాడు బాబాయి.

"నాకిక్కడ అనేక పన్లున్నాయి. పోనీ మీ కోడలుని తీసుకువెళ్ళు. వాళ్ళ తరఫు ఆడవాళ్లు వసే ఆరా తియ్యగలుగు.. అమ్మో యిది ఆవులిస్తే పేగులు లెక్కబెట్టే రకం" అన్నాను నేను నవ్వుతూ.

బాబాయిది పూర్తిగా మొండిపట్టుదల.

"కోడలూ వస్తుంది. అది మరి మంచిది. ఇహ అడ్డుచెప్పక మూటాముల్లే సర్దుకోండి" అన్నాడు బాబాయి గట్టిగా.

అందువల్ల కామేశ్వరీవరనిర్ణయం నిమిత్తం బాబాయి మాటతోసివెయ్యటానికి వీలులేక కమలతో సహా బెజవాడ వెళ్ళవలసి వచ్చింది.

## 3

ఇంటికి వెళ్ళి సమాలోచనలు జరుపుకుని మా నిర్ణయం తెలియజేస్తానని బాబాయికి మాట యిచ్చి తిరిగి వచ్చేశాము మేము.

ఆరోజు సాయంకాలం కమలా నేనూ మా మిద్దెమీద కూర్చుని వరుసగా శంకర, సుందర, శివరావుల్లో కామేశ్వరికి తగ్గ కాతగిన అర్హతలు ఎవరికి వున్నవో నిర్ధారణ చేసే నిమిత్తం పూనుకున్నాము.

"కమలా! మన నిర్ణయాల విషయం పదం పడి పర్యాలోకిద్దాముగాని ముందు మనం నిర్ణయించిన వరుడిని కామేశ్వరి వప్పుకుంటుందనే నమ్మకం ఏవుందీ" అని సందేహం వెలిబుచ్చాను.

"ఆ విషయం కామేశ్వరినే అడిగాను. అది మహా బుద్ధిమంతురాలు. పైగా తండ్రి తన పెళ్లికి పడే తిప్పలు కళ్ళారా చూసి వున్నదేమో చటుక్కున అన్నది గదా—

"వదినే...నాకు నచ్చటమనేది పెట్టుకో

# ★ వరుడు - కావలెను ★

ేగు. అవతల తమ్ముళ్లు వున్నారు. వాళ్ళ గతికూడా ఆలోచించాలి కదా. ఏ కోతి అయినా సరే కట్నం లేకుండా చేసు కుంటానంటే—అన్నది కళ్లనీళ్ళు పెట్టు కొని—"

"మాడు కమలా యివన్నీ చూస్తూవుంటే నాకు తల తిరిగిపోతూంది. నేను నీకోసం ఒక రోజున నా హృదయానికే మోసం చేసు కున్నాను......విద్యాసాగరం తండ్రిని సంతోష పెట్టటానికి పెళ్లాన్నే వదిలెయ్య టానికి సిద్ధమయ్యాడు. కామేశ్వరి మరొకరి క్షేమం కోరి తన సుఖాన్నే వదిలేస్తూవుంది. అయితే కామేశ్వరి చేసే త్యాగం—"

ఆతరువాత మాటలు దొరకక ఆగి పోయాను.

కమల అన్నది—

"త్యాగం అంటే ఏమిటో నాకు సరిగ్గా అర్థం కాలేదు. ఈ పరిస్థితుల్లో కామేశ్వరికి రెండు పనులు చేయటానికిమాత్రమే అవ కాశం వుంది. ఒకటి కట్నం లేకుండా వచ్చే సంబంధం చేసుకోవటం—మీకూ తెలుసుగదా సాధారణంగా అటువంటి సంబంధం కూడూ గుడ్డా లేనిదే అవుతుంది. అందుకు వప్పుదల అయి అన్ని బాధలూ పడుతూవుండటం ఒకటి—రెండు అసలు వివాహవిషయమే ఎత్తకుండా తన పొట్ట తను పోషించుకోవటం ఒకటి. దీనివల్ల కొస్త సుఖం వుందేమో గాని యిందుకు మీబాబాయి ఎంతమాత్రం వప్పుకోరు. అను శ్రుతంగా వస్తూవున్న ఆచారాలూ, కట్టు బాట్లూ, మీ బాబాయీ, ఆయన తాలూకు పితృపితామహులూ అందరూ దీనికి ఘోషి స్తారు. సంఘం యీ ఘోషకి గుగ్గిలంలా పనిచేస్తుంది. ఇందులో కామేశ్వరి యింధ నంలా మాడిపోవాల్సివస్తుంది."

"అయితే యీపాపంలో మనమూ పాలు పంచుకోవలసిందేనా కమలా. ఇవాళ మనం చేసే నిర్ణయంతో కామేశ్వరి కంఠా నికి మూడు ముళ్లతో యమపాశం కట్టటమే అవదా—" అన్నాను నేను.

కమలకుకూడా యీ మాట నచ్చింది.

"ఆమాట నిజమే. అయినా ఆ వచ్చిన సంబంధాలుమట్టుకు ఏపాటి లక్షణం గా వున్నాయి లెద్దురూ. ఆ మొదటవచ్చిన పేడి మూతి పెళ్ళికొడుకు... వాడి పేరు యేవ న్నారూ?"

"శంకరం..."

"ఆ అదే ఆ శంకరంగారు బి. ఎ. నాలుగు సార్లు దండయాత్ర కొట్టారు. వాళ్ళ మేనత్త కొడుకు సెంట్రలు గవర్నమెంటులో ఉద్యోగం వెలగబెడుతున్నాడనీ...తనకీ వుద్యోగం యిప్పిస్తానన్నాడనీ అంటాడు అతను. అదిగాక ఒక సెంటుభూమికూడా లేదుగదా. అతనికి వున్న క్వాలిఫికేషనల్లా మేనత్తకొడుకు వుద్యోగమేనా ...యింకే మన్నా వున్నదంటారా" అన్నది కమల.

"అంతే ననుకుంటాను. మరి రెండో వరుడు సుందరరావు సంగతో —"

"అతని పేరులోవున్న సొగసు మొహంలో లేదండీ. అయినా బొత్తిగా చదువు లేదు. నాలుగో ఫారంకూడా చదవని వాడికి యింటరు పాసయిన అమ్మాయితో పొత్తు కుదురుతుందా. పైగా వధవ యిన్ఫీరియారిటీ కాంప్లెక్సు తగలడి సంసారం తగలడి పోతుంది. అదిగాక వాడి ధీమా చూడండి. సొంతవ్యాపారం వెలగబెట్టి మూడువందలు దాకా సంపాదిస్తూ వున్నాడన్నాడా... మీరు నిలవదీసి నాలుగు ప్రశ్నలూ అడిగే సరికి అది హుళక్కి అనీ తేలిపోయింది... ఛి వాడి బతుకుమండా...

"అతన్ని అని ప్రయోజనమేవుంది... మనం అన్నిటికీ సమ్మతిపడే రమ్మన్నాం గదా" అన్నాను నేను.

"అందుకని సిగ్గులేకుండా రెండువేలు కట్నం అడుగుతాడా." అన్నది కమల కోపంతో—

"ఇహ శివరావుగారి సంగతి. లంకలో స్కూలు మాష్టరీకి దరఖాస్తుపెట్టాడట. ఇంటర్వ్యూకీ వగైరాలకి వెయ్యిరూపా యలు వెంటనే యిచ్చి వుద్యోగం వచ్చేలా చూస్తే కట్నం కానుకలు లేకుండా కామే శ్వరిని చేసుకుంటాడుట. బాగుండా వరస" అన్నది కమల.

"బాబాయి ఆ పనిమీకే తిరిగితే సరి" అన్నాను నేను మాటవరసకి.

"హిరణ్యాక్షుడిలా వరాలు కోరే వరులు దొరుకుతూవుంటే కాబోయే అల్లుడి వుద్యోగంకోసం సేతువు దాటి మావగారు వుద్యోగం వెదకాల్సిందే. తప్పుతుందా మరి" అన్నదికమల.

"ఇంతకీ యేమి తేల్చావు నువ్వు"

"చూస్తూచూస్తూ కామేశ్వరి మెడకి గుది బండ కట్టలేము - ఏదీ నచ్చలేదని మీ బాబాయిగారికి రాసేయండి" అన్నది కమల దృఢనిశ్చయంతో.

వాస్తవానికి నేనూ ఆ నిర్ణయానికే వచ్చి వున్నాను.

ఈవిధంగా శంకర, సుందర, శివరావులు ముగ్గురూ పరీక్షలో తప్పారు. ఏతత్ఫలితం మా బాబాయికి తెలుపుడు చేయటంఅయింది.

మా బాబాయి పంపిన "వరుడు కావలెను" అనే ప్రకటనయొక్క ప్రయోజనం యింత వరకూ కలగలేదు.

సహృదయంతో ముందుకు వచ్చే యువ కులు దొరకకపోతారా అనే ఆశ మా బాబా యికి వుంది. అందుకనే యింత జరిగినా పేపర్లో ప్రకటిస్తూనే వున్నాడు- "వరుడు- కావలెను" అని. ★




# అబద్ధాల పోటీ

**వ్రజపాణి**

అనగనగా నొకపురమున
అన్నదమ్ము లొక ముగ్గురు;
అసత్యాలు పలుకుటలో
అందరి కందరు ఘనులే.

చిన్నతనమునుండియు ఆ
అన్నదమ్ము లెల్లైనను
చెన్ననగరమును చూడగ
ఎన్నో కలలను గాంచిరి.

తల్లిదండ్రు లెఱుగకుండ
చల్లగ నొకనాటిరాత్రి
ఇంటపైకమును హరించి
వెంటనె చెన్నపురి కేగి—

స్టుడియోలను దర్శించిరి,
అడయారున విహరించిరి,
జార్జిటౌను, పార్కుటౌను,
సర్వస్థలములు తిరిగిరి.

ఆ మువ్వురు ఒక్క సంధ్య
అంబుధితీరమున కేగి,
అట చల్లని యిసుకలపై
ఆటలాడి అలసినారు—

చిన్నవాడు తన యిద్దరు
అన్నలకును తన అసత్య
కల్పనలను జూపదలచి
గట్టిగ నిట్టులవచించె:

"అద్దిర! చిత్రము! సాగర
మధ్యమ్మున అల్లదిగో!
ఎంత పెద్ద తాటిచెట్టు!
వింతగనున్నది కాదా!"

అది విని మధ్యముడు పల్కె:
"అది నిజమే! అంతెకాదు!
నీ చెప్పిన తాడిమీద
నిలిచిన దొక కాకిపిల్ల!"

స్వల్పవయస్కుల అసత్య
కల్పనలను విని జ్యేష్ఠుడు,
ఇద్దరు తమ్ములకన్నను
పెద్ద అసత్యము వచించె:

"నీటిమధ్య తాడిగలదు!
తాటిమీద కాకిగలదు!
అది వేసిన కేకలు నే
నాలకించుచున్నాడను!"

సిగ్గుపడి అతని తమ్ములు
దిగ్గున నిట్లు వచించిరి:
"వయసు చేత, తెలివి చేత
వహ్వా! మా పెద్దన్న వే!"




# చక్కని సలహా

చాలాదినములు మాంసము దొరకక
డీలా పడినది ఒకనక్క.
బిక్కమొగముతో, బక్కకడుపుతో
డొక్కలుమాడిన ఆనక్క

ఆవురావురని అడవి యంతటా
ఆహారముకై తిరిగినది.
చిట్టచివరకొక చెట్టు తొఱ్ఱలో
రొట్టెలు, మాంసము చూచినది.

ఇరుకు తొఱ్ఱయని ఆలోచించక
ఉరుకున లోనికి ఎక్కినది.
పొట్ట చెక్కలగు నట్లుగ అంతా
దిట్టముగా అది మెక్కినది.

పోవుదమనుకొని లేచెనుగానీ
పొట్ట అడ్డమై పోయినది.
వెలుపల పడుటకు మార్గముదొరకక
విలపించుచు కూర్చుండినది.

ఏడుపు వినబడి వేరొక జంబుక
మేమిది యనుకొని వచ్చినది.
చిక్కుపడిన ఆనక్కను చూచీ
చక్కనిసలహా ఇచ్చినది.

"నకనకలాడెడు సమయములోనే
చకచక పోతివి లోపలకు.
నకనకలాడెడు నపుడే మళ్ళీ
చకచకరావలె వెలుపలకు."

**ఈసప్ కథలు : 9**

నండూరి రామమోహనరావు



**నీతి:**

ఎంత గింజుకొన్నగాని — కాలమహిమవలనె సాను

ఏమి లాభ, మొక్కొకతరి — కూలపడును కార్యమ్ములు.




## 20

మార్గరెట్ కు పై ప్రాణాలు పైనఎగిరిపోయినాయి. "గాడ్ సేవ్ ది కింగ్." ఆ పాట పాడుతున్న వాడు సర్ పెర్సీ. షావలిన్ కూడా పాటవిన్నాడు. ఉలికిపడిలేచాడు. తలుపువైపు ఒకసారిచూచి, ప్రక్కన పెట్టుకుని ఉన్నతనటోపీ తీసి తగిలించుకున్నాడు.

పాడుతున్నవ్యక్తి సమీపిస్తున్నాడు. పైనుండి ఉరికి, పెర్సీవద్దకు పరుగునపోయి, "పారిపో. నామాట విను- పారిపో వెంటనే," అని హెచ్చరిద్దామనుకున్నది మార్గరెట్. లేవటానికి ప్రయత్నించింది. కాని అంతలోనే ఉద్వేగాన్ని అతిప్రయత్నం మీద అణచివేసుకున్నది. షావలిన్ ఎటూ అడ్డు పడతాడు. పైగా బయట సైనికులు కాపలా ఉన్నారేమో తెలియదు. తాను తొందరపడితే, ఉచ్చు బిగుస్తుందని మార్గరెట్ భయపడింది.

పాట వాకిలివద్దకు వినిపించింది. తలుపు తెరుచుకున్నది. ఒకటి, రెండుసెకండ్లు అంతా నిశ్శబ్దమైంది.

మార్గరెట్ కు వాకిటివద్ద ఏమి జరుతున్నదో కనిపించదు. ఊహిస్తూ కూర్చున్నది.

పెర్సీ తలుపుత్రోసుకొని లోపల అడుగుపెట్టటంతోనే "మతాధికారి"ని చూశాడు. తొట్రుపడ్డాడు - నాలుగైదుసెకండ్లపాటుమాత్రం. ఆ తరువాత పెర్సీ సరాసరి హాలుమధ్యకు వచ్చాడు. అక్కడ నిలబడి పెద్దగొంతుకతో హుషారుగా కేకవేశాడు. ఏయి? ఎవరులోపల? ఎక్కడోయి బ్రోగార్డు? కనిపించడేం?

రిచ్ మండ్ లో బయలుదేరుతుండగా మార్గరెట్ చూసినప్పుడెట్లా ఉన్నాడో, ఇప్పుడూఅట్లాగే ఉన్నాడుపెర్సీ. ఇటువంటి శత్రుభూమిలో తిరుగుతున్నా, ఏ వేల్సుయువరాజు చేస్తున్నవిందుకో బయలుదేరి పోతున్నట్లు ఉన్నాడు.

హాలుమధ్య నిలబడిఉన్న పెర్సీని చూస్తూ మార్గరెట్ బొమ్మలాగా ఉండిపోయింది. ఊపిరి కూడా పీల్చలేకపోయింది. ఏక్షణాన షావలిన్ తన భటులకు సైగచేస్తాడో, ఏక్షణాన జమాజెట్టీలలాంటి సైనికులు మీదపడి పెర్సీనిబంధిస్తారో, అనుకుంటూ మార్గరెట్ గజగజలాడిపోయింది.

పెర్సీమెల్లిగా షావలిన్‌కూర్చున్న బల్లదగ్గరకువెళ్లాడు. షావలిన్ వీపుమీద గట్టిగా తట్టి మామూలు ధోరణిలో అన్నాడు. "ఓరి నీదెబ్బకూల! ముష్యూర్ షావలిన్!... ఇదేమిటి ఇక్కడఉన్నారు? నేననుకోలేదు..."

సర్ పెర్సీ వీపుమీద చరిచినక్షణాన షావలిన్ స్నూనుతో నూపు ఎక్కిస్తున్నాడు. కొరబోయింది. ముక్కులు [illegible]నాయి. ముఖాన కత్తివేటుకు నెత్తురుచుక్క లేకుండాపోయింది. జన్మలో ఎప్పుడూ అంత విస్మయం అతనికి కలుగలేదు. అయితే ఆసంగతి బయటపడకుండా దగ్గుతెర రక్షించింది. సర్ పెర్సీ ఇంత ధైర్యంచేస్తాడని అతడు కలలో కూడా అనుకో

లేదు. పైగా హోటలుదగ్గర సాయుధసైనికులను అట్టి పెట్టలేదు. అందుచేత మరింత కంగారు పడిపోయినాడు.

మార్గరెట్‌కు పెర్సీ ఉద్దేశమేమిటో అంతుచిక్కలేదు. పావలిన్ ఇంతకుముందే డెజ్‌గాజ్‌కు ఇచ్చిన ఉత్తరవులసంగతి తెలియక పోవటంచేత పెర్సీ తాత్సారం చేస్తున్నాడు. అయినా పెర్సీ అంతగా హోటలు నుండి బయటపడినా, ఏ ప్రక్కకుపోయినా ఇట్టే పట్టేస్తారు. అక్కడే మరి రెండుక్షణాలు ఉన్నాడా, డెజ్‌గాజ్ అరడజనుమంది సైనికులతో రావచ్చును. అయిపోయింది. ఈ మహావ్యక్తి పనిఅయిపోయింది. అనుకొని కుమిలిపోతున్నది మార్గరెట్.

ఇద్దరు ప్రత్యర్థులు అక్కడ కలుసుకున్నారు. అందులో పావలిన్ కొంచెంజంకుతున్నాడు. ఆ జంకు తన గురించికాదు. తన ప్రాణాన్ని లక్ష్యంచేసే రకం కూడాకాదు అతడు. ఈ అవకాశంజారిపోతే ఎలాగా అని అతనిభయం.

పెర్సీ పకపక నవ్వసాగాడు. మళ్ళీ పావలిన్ వీపుతట్టాడు. "వెదనది! క్షమించాలి. పాపం సూప్ తింటున్నట్టున్నారు. ఈసూప్ అంత వెధవది- ఛండాలపుది మరొకటి లేదనుకోండి. అన్నట్టు- ఒకసారి ఏమైందనుకున్నారు? మావాడొకడు సూప్ పుచ్చుకుంటుండగా కొరబోయింది. అట్లాగే పాపం చచ్చిపోయినాడు." అంటూ పకపకలాడాడు.

పావలిన్ ఇంకా తేరుకోలేదు. బిత్తరపోయి చూస్తున్నాడు. "వెధవది! ఇంతబతుకు బతికి- ఈ బిలంలోవచ్చి పడాలసిన కర్మంపట్టింది. వట్టిగుహ -కాదూ?" అంటూ ఒకకుర్చీ దగ్గరకులాగుకొని కూలబడ్డాడు. "చూడండి మీరు ఏమీ అనుకోకుంటే కాస్తనేనూ వడ్డించుకుంటాను. ఏమంటారు? ఆ వెధవ - బ్రోగార్డ్ - ఏమూలనోపడి నిద్రపోతుంటాడు."

పావలిన్ అనుమతికోసం పెర్సీ చూడనేలేదు. అక్కడేఉన్న మరొకప్లేటు ముందుకులాగుకొని, కాస్త సూపువడ్డించుకొని తృప్తిగా ఆరగించాడు. ఆ తరువాత ఒకగ్లాసు వైన్ సేవించాడు.

"మిమ్మల్ని ఇక్కడ కలుసుకున్నందుకు చాలా సంతోషంగా ఉన్నది. మీరు ఛానెల్ దాటి ఈప్రక్కకు వచ్చారని తెలియదు. హఠాత్తుగా మీరు కనిపించేసరికి నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. అందుచేతనే వెంటనే పలకరించలేక పోయినాను. క్షమించాలి." అన్నాడు పావలిన్.

"అబ్బే! దానిదేముందండి? కాదు మనీ షాబడిన్!"

"క్షమించాలి. పావలిన్..."

"పొరపాటు పొరపాటు. పావలిన్ కదూ! అవును. ఈ విదేశీపేర్లున్నాయి చూశారు? అవి నాకు భ్రాంతిగా పలకటం చేతకాదు."

మరికాస్త సూపు వడ్డించుకున్నాడు పెర్సీ. ఇంగ్లాండు నుండెల్లా పనిగట్టుకువచ్చినది ఈ మూరికికూపంలో ఈ సూపు కోసమేనన్నట్లు కనిపించాడు.

ఆ పావలిన్ ముక్కుపగలకొట్టి ఎందుకు పారిపోకూడదుపెర్సీ అని వేగిరపడసాగింది మార్గరెట్. మధ్యమధ్య మూడునాలుగుసార్లు పెర్సీకన్నులు మిలమిల మెరిసిపోయినాయి. నిద్రమత్తు కాస్త వదలినట్లు కనిపించింది. దానినిబట్టి ఏదోఉపాయం చూస్తునే ఉన్నాడని మార్గరెట్ గ్రహించింది.

పావలిన్ కూడా స్థిమితపడి, సూప్ తినసాగాడు. సర్ పెర్సీ చాలా దూరం ఆలోచించాడు. ఇన్నిసార్లు ఇందరికళ్ళల్లో దుమ్ముగొట్టి ప్రభువంశీకులను తప్పించిన అతని తెలివితేటలు సామాన్యమైనవా? తొందరపడి వ్యవహారం ముదర పెట్టకూడా, వీలయినంతవరకు ఉపాయంగానే తప్పుకుపోవాలని అనుకున్నాడు.

"ఈమధ్య మీరు సన్న్యాసం పుచ్చుకొని, మతాధికారి అయినారని నేను విననైనా లేదు." అన్నాడు పెర్సీ ఛలోక్తిగా.

ఏమి సమాధానం చెప్పాలోతోచక, "అబ్బే లేదు. లేదు!" అని నసిగాడు పావలిన్.

సర్ పెర్సీ మరోగ్లాస్‌వైన్ సేవించాడు. "మీరు ఈ వేషం కాదుగదా! మరేదయినా వెయ్యండి. నేను పోల్చుకోగలను" అన్నాడు.

"ఉహు! అలాగా?"

"మరి! వేషం వేస్తే ఎలాగైనా మనిషి రూపు కొంచెంమారుతుంది. ఈవేషం మీకున్నదే ... అంత బాగాలేదు. అలా అన్నానని కోపంలేదు కదా!"

"కోపం ఎందుకు......సరే గానియ్యండి. లేడీ బ్లాకెనీ కులాసాయేనా?"

"ఆఁ! ఆఁ! మీదయవలన."

పావలిన్ చాలా చిరాకుపడ్డాడు. డెజ్‌గాజ్

ఎంతకీ రాడేమిటా అని నాలుగుసార్లు వాకిటి కేసి చూశాడు. గడియారంవంక చూసుకున్నాడు. కెజ్ గాజ్ మరి రెండు మూడునిమిషాలలోనే రావచ్చును.

"సర్ పెర్సీ పారిస్‌బయలు దేరి నట్లున్నారు."

"అబ్బే లేదండీ, పారిస్‌ట...ఇంత బతుకుబతికీ... అక్కడికి ఇప్పుడు వెళ్ళి సుఖంలేదండీ. చాలా ఘండా అంగా తయారైంది."

"మీబోటివారికేమండీ? మీకు సుఖంగానే ఉండాలే! ఇక్కడివ్యవహారాలలో తలదూర్చని వారి కేమిఇబ్బంది?" అన్నాడు షావలిన్ కసిగా.

"అదీ నిజమే."

షావలిన్ మళ్ళీ టైంచూశాడు. "మీరేదో హడావిడిగా ఉన్నట్లున్నారు. కానియ్యండి," అంటూ పెర్సీ అక్కడినుండి లేచాడు. కుర్చీ నెగడు దగ్గరకు లాగుకున్నాడు. "నాకేంతొందర లేదు. కబుర్ల కేమిటి? వెధవది ఎప్పుడయినా చెప్పుకోవచ్చు. తప్పనిసరి అయితే సరే, లేకపోతే ఈకూపంలో కూర్చోవటం నా కిష్టంలేదు." అంటూ యథాప్రకారం మాట్లాడుతూనే ఉన్నాడు.

షావలిన్ మరొకసారి టైం చూశాడు. "ఏమండీ! నాకు తెలియక అడుగుతాను. మీరు మాటి మాటికి దానివంక చూస్తేమాత్రం టైం పరుగెత్తు

తుందా? ఎవరికోసమైనా చూస్తున్నారేమిటి?"

"అవునండీ - మా మిత్రుడొకడు......"

"అలాగా?...పోనీ ఇక్కడికివచ్చి మీరుకూడా సెగడు దగ్గర కూర్చోరాదూ? వెచ్చగా, హాయిగా ఉన్నది." అంటూ పెర్సీ సెగడులోని పుల్లలను తన్ని కదిలించి మంట పెద్దదిచేశాడు. ఇంకొక కుర్చీకూడా దగ్గరకు లాగాడు. పావలిన్‌కు ఏమీ తోచటంలేదు. ముళ్లమీద ఉన్నట్లున్నది. ధ్యాసఅంతా డెజ్ గాజ్ మీద ఉంచుకొని, పెర్సీమాటలు యాదాలాపంగా వింటున్నాడు. పెర్సీ పిలుపుపైన వచ్చి ఆ కుర్చీలో వాకిటకేసి తిరిగిచూస్తూ కూర్చున్నాడు పావలిన్.

ప్రాణాలు బిగపట్టుకొని కూర్చున్న మార్గరెట్‌కు దూరాన డెజ్ గాజ్, సైనికులతో కలిసి వస్తున్నట్లు అడుగులచప్పుడు వినిపించింది. ఆ చప్పుడు పావలిన్ విన్నాడు; పెర్సీ విన్నాడు.

రెండు మూడు నిమిషాలలో వారు లోపలికి ప్రవేశిస్తారు!

పెర్సీ లేచి బల్లదగ్గర నిలబడ్డాడు. వారు తిని విడిచిపెట్టినవన్నీ ఆ బల్లమీదనే ఉన్నాయి. పావలిన్‌వైపుకు వీపుత్రిప్పి నిలబడ్డాడు సర్ పెర్సీ. ఆగకుండా మాటలు దొర్లిస్తూనే ఉన్నాడు. కాని తన జేబులోనుండి పొడుముకాయ తీశాడు. బల్లమీద మిరియపుపొడిగిన్నె ఉన్నది. ఆ పొడితీసి యింత పొడుముకాయలోనికి ఎక్కించాడు.

"ఆపని పూర్తికాగానే నవ్వుతూ పెర్సీ పావలిన్ వంక తిరిగాడు.

"ఏమిటో అన్నట్లున్నారు:" అన్నాడు.

పావలిన్ దీక్షగా తనవారి అడుగులసవ్వడి వింటున్నాడు. పాపం పెర్సీసంగతి ఒక క్షణంపాటు మరిచిపోయినాడు. పెర్సీ మాటలతో ప్రస్తుతానికి వచ్చిన పావలిన్ "ఏమిటి?" అని అడిగాడు.

"ఏమీ లేదు. ఇదుగో ఈనస్యంమాట చెప్తున్నా. అక్కడ ఒక యూదుడు ఈసారి భలేనస్యం అమ్మాడులే. ఇటువంటి సరుకు ఎప్పుడూ చూడలేదనుకోండి. కావాలంటే మీరే చూడండి. ఒకపట్టు:" అంటూ పొడుంకాయ పావలిన్‌ముందు పెట్టాడు పెర్సీ.

పావలిన్ అప్పుడప్పుడు ఒకటి రెండు ఎత్తులు, జిత్తులు చూచే ఉన్నాడు. కాని ఇటువంటిదొకటి జరిగే అవకాశం ఉన్నదని కలలోనైనా అనుకోలేదు. డెజ్ గాజ్‌తో వస్తున్న సైనికుల అడుగులచప్పుడు చెవితో వింటూ, వాకిలిమీద ఒక కన్ను ఉంచి, ఒక చేతితో ఒకపట్టు నస్యంతీసి ముక్కులలోకి ఎక్కించాడు.

పావలిన్ నస్యంపీల్చి ఏమయినాడో బాగా అర్థం కావాలంటే ఎప్పుడయినా ఏ పొరపాటు చేతనో గ్రహపాటు చేతనో మిరియపుపొడి పీల్చినవారికి మాత్రమే తెలుస్తుంది.

తల తిరిగిపోయింది. తుమ్ముమెంబడి తుమ్ము లంకించుకున్నది. కళ్లు నీళ్లు తిరిగి, చీకట్లు క్రమ్మినాయి. కన్నులు, ముక్కు, చెవి, ఏ ఒకటి అదుపులోలేని పరిస్థితిలో పడ్డాడు.

మాట్లాడకుండా పెర్సీ తన టోపితీసి నెత్తిక తగిలించుకొని ట్రోగార్డ్‌కు ఇవ్వవలసిన డబ్బులు బల్లమీదపెట్టి హాలులోనుండి ప్రశాంతంగా బయటికి పోయినాడు.

## 21

మార్గరెట్‌కు శంకేంద్రియాలు స్వాధీనంలో లేవు. ఆశ్చర్యంలోనుండి తెప్పరిల్లి, ఏమిజరిగిందో అర్థంచేసుకునేసరికి కొంత ఆలస్యమైంది. సర్ పెర్సీ వేసినయెత్తు తేలుసుకోగానే ఆమెకు సంతోషం, విస్మయం ముప్పిరిగొన్నాయి.

పావలిన్ అప్పటికి ఇంకా తేరుకోలేదు. నీళ్లలో పడిన ఈతరానివానివలె తన్నుకుంటున్నాడు.

పెర్సీ బ్లాకెనీ కులాసాగా బయటికి పోయినాడు. బహుశా బ్లాంబార్డ్ శిథిల కుటీరానికి పోయి ఉంటాడు. ఈ నిమిషానికి గండం ఎలాగో తప్పిపోయింది. కాని పూర్తిగా ప్రమాదం తప్పిపోలేదు. పెర్సీ ఎటు ప్రక్కకుపోయినా కెప్టెన్ జక్లై మనుష్యులు పట్టుకుంటారు. పెర్సీ బయటికి పోయేముందు, తాను పోయి కలుసుకొని ఉండవలసింది అని మార్గరెట్ చింతించింది.

ఇంతలోనే హోటలుబయట సైనికులు వచ్చి ఆగారు.

పావలిన్‌కు తుమ్ములు రావటం కొంచెం తగ్గింది. నిలబడటానికి కాస్త వీలయింది. డెజ్ గాజ్ తలుపు వద్దకు వచ్చినసంగతి తెలియగానే, ఎలాగో తంటాలు పడి వాకిటిదగ్గరకు పోయినాడు. తానే తలుపు తీశాడు.

డెజ్‌గాజ్ నోరు విప్పేముందుగానే తుమ్ముకుంటూ, తుమ్ముకుంటూ అడిగాడు.

"పొడుగాటి విదేశీయుడు - చెప్పు - కనిపించాడా? మీలో ఎవరికైనా?"

డెజ్‌గాజ్ ఆశ్చర్యంతో "ఎక్కడండీ?" అని అడిగాడు.

"ఇక్కడేనయ్యా! ఈ వాకిలిగుండానే పోయినాడు. అయిదు నిమిషాలయినా కాలేదు."

"మా కెవ్వరికీ కనిపించలేదు. ఇంకా వెన్నెల కాలేదయ్యె."

"అయిదు నిమిషాలు ముందువచ్చిఉంటే మీరు ఎంతో బాగుండేది."

"నేను........................"

"చెప్పినది తూ. చ. తప్పకుండా చేశావు. నాకూ తెలును. ఇంతసేపు చేస్తే ఎలా? అదృష్టవశాత్తు ప్రమాద మేమీ జరగలేదు. లేకపోతేనా - నీ పాట్లు కుక్కలుకూడా పడేవికావు."

డెజ్‌గాజ్ అతని తీవ్రతకు వణికిపోయాడు. "పొడుగాటి విదేశీయుడా అండీ?"

"అవునండీ! అతడే. అయిదునిమిషాలముందు ఇక్కడే ఉన్నాడు. ఈ టేబులుముందు కూర్చుని పొట్ట పగల మెక్కాడు. నేను తొందరపడకూడ దనుకున్నాను. అతడేమో దున్నపోతులాగ ఉన్నాడు. బ్రోగార్డు లోపల ఉన్నాడన్నమాటేగాని శుద్ధ దున్నపోతు. వాడివలన ప్రయోజనంలేదు. ఇంకేం? చల్లగా జారుకున్నాడు."

"ఎక్కడికి జారుకుంటాడు? కెప్టెన్ జల్లె నల్భై మందిని గస్తీకి మళ్లీ పంపించాడు. అందులో ఇరవై మంది సముద్రతీరంవెంట పోయినారు. గస్తీ చాలా జాగ్రత్తగా కాస్తున్నారు."

"వారినందరినీ నీవు హెచ్చరించావా?"

"ఆఁ! మీరుచెప్పినదంతా చెప్పాను. అన్నట్లు ఇంకొకవిశేషం తెలిసింది."

"ఏమిటది?"

"ఒక పొడుగాటి ఇంగ్లిష్‌వాడు ఒక ముప్పావు గంట క్రిందట ఇక్కడే రూబెన్ అనే ఒక యూదుడితో చాలాసేపు మాట్లాడుట."

"దేనిని గురించి?"

"గుఱ్ఱపుబండికోసం. 'పదకొండు గంటలకు వస్తాను, బండి సిద్ధంగా ఉండాలి' అని చెప్పాడుట."

"పదకొండు దాటిపోయింది. రూబెన్ ఉండేది ఎక్కడ?"

"ఇక్కడే పదిగజాల దూరంలో."

"సరే ఎవడినైనా పంపించు. రూబెన్‌బండి పోయిందోలేదో, అతడు దానిలో ఎక్కిపోయినాడేమో విచారించి రమ్మను."

డెజ్‌గాజ్ బయటికిపోయి మనిషిని పంపించాడు.

డెజ్‌గాజ్, షావలిన్ మాట్లాడుకున్న మాటలన్నీ చాలా శ్రద్ధగా విన్నది మార్గరెట్. మళ్లీ నిరాశలో పడిపోయింది. ఎటుపోయి ఎటువచ్చినా, షావలిన్‌ను తాను ఒకకంట కనిబెట్టి, అతని ఆలోచన తెలుసుకుంటూ ఉంటే కొంత మేలు జరుగుతుందని ఆశించింది.

షావలిన్ ఆహారంకోసం చూస్తున్న పులిలాగా అటూ ఇటూ పచారుచేస్తున్నాడు. అయిదునిమిషాలు గడిచినాయి. డెజ్‌గాజ్ ఒక యూదును వెంటబెట్టుకొని వచ్చాడు.

అతడు కొంచెం వయసు మళ్లినవాడు. మురికి గుడ్డలు కట్టుకున్నాడు. రాగిజుట్టు ఉంగరాలు తిరిగి ఉన్నది. వినయంగా వంగి నమస్కారాలు చేసుకుంటూ ప్రవేశించాడు.

ఫ్రెంచివారందరికీ యూదులంటే మంట. యూదులను అంటరానివారుగా భావిస్తారు. వచ్చిన యూదు చేతులు కట్టుకొని దగ్గరకు వచ్చాడు.

"ఏయ్. ఏయ్. దూరం. దూరంగాఉండు. అని చీదరించుకున్నాడు షావలిన్.

ముగ్గురూ హాలుమధ్యన నిలబడ్డారు. మార్గరెట్‌కు వారు దీపపువెలుగులో స్పష్టంగా కనిపిస్తున్నారు.

"ఇతడేనా రూబెన్?" అని అడిగాడు షావలిన్. డెజ్‌గాజ్ సమాధానం చెప్పాడు. "కాదండి. రూబెన్ ఎంత వెతికినా కనిపించలేదు. అందుచేత బండి తోలుకొనిపోయినాడేమో ననుకున్నాము. ఇతనికి ఆసంగతి ఏమో తెలుసుట. తగిన బహుమానం యిస్తే చెప్తానంటున్నాడు."

"ఓహో!" అంటూ పావలిన్ అతనివైపు తిరిగాడు." వింటున్నావుగా ఆయన చెప్పినది? ఆ ఇంగ్లీషువాడున్నాడే - మా మిత్రుడు - అతనినిగురించి నీకేమి తెలుసో చెప్పు. అతనిని చాలా అవసరంగా కలుసుకోవాలి."

యూదుడు పావలిన్ చెప్పేమాటలు శ్రద్ధగా వింటూ రెండడుగులు ముందుకు వేశాడు. పావలిన్ మండిపడుతూ "ఏయ్. నిన్నే - దూరం!" అంటూ కేకలు వేశాడు.

"సిత్తం బాబయ్యా! ఆ పొడుగాటి ఆయన నాకున్నూ రూబెన్ గాడికిన్నీ కనుపించారు - ఇయ్యేళ సాయంత్రం."

"మీరు అతనితో ఏమైనా మాట్లాడారా?"

"లేదండి. ఆయనే మాతో మాట్లాడినారు, ఆడ మార్టిన్ రోడ్డు లేదండీ? ఆరోడ్డెంట ఏడకో పోవాలంట. బండి దొరుకుద్దా అని అడిగినారు."

"ఏమిటి - ఏరోడ్డు?"

"అబ్బే అబ్బే - ఏమీలేదండి. ఆ రూబెన్ గాడు లేడండి—దిక్కుమాలిన ముండాకొడుకు ఆసచ్చు పీనుగ......"

"ఏయ్! ఏమిటావాగుడు! జరిగినదేమిటో తేల్చు."

"అదేనండి సెప్తున్నా. ఆడు నానోటి ముందు కూడు తీసేశాడు గాదండి మరి? 'బంగారంలాంటి బండి నిక్షేపంలాంటి గుఱ్ఱమూ మనకాడ ఉన్నాయ'ని నేను ఓ సెంప సెప్తానే ఉన్నానండి. ఆ రూబెన్ గాడు బేరానికి అడ్డుతగిలి, ఆడి కుంటిగుఱ్ఱమున్నూ బండి కట్తా నన్నాడుండీ..."

"ఇంగ్లీషువా డేమన్నాడు?"

"సిత్తమయ్యా. ఆ పెబువుకేమి తెలుసండి ఈడి గుఱ్ఱం కుంటిదన్నమాట. అసలు అది వట్టి ఎముకల పోగు కాదటండీ? ఏనాడన్నా దానిముంగల ఓ పరకేస్తేనా? పదకొండుగంటలకి గనుక బండి సిద్ధంచేస్తే, ఇది సీకిస్తానని ఆ పెద్దమనిషి ఇంత డబ్బుమూటతీసి ఆసైతాను ముండాకొడుక్కి సూపించినారండి."

"అయితే పదకొండుగంటలకు బండి కట్టాడా వాడు."

"ఏదో కట్టాడు లెండి. సెప్పనా? రూబెన్ గాడిని ఆడి కుంటిగుఱ్ఱం నానాగడ్డి కరిపించిందిగాదుండీ? ఎట్టాగైతేనేం దాన్ని ఈడ్చుకొచ్చి పడేశినాడు." అంటూ యూదు నవ్వుకున్నాడు.

"మరి వారు బయలుదేరారా?"

"ఆఁ! ఓ అయిదు నిముసాల కిందట బండి సాగింది లెండి. ఆడికి లేకపోతే బుద్ధి ఆ పెద్దమనిషి

కన్నా ఉండొద్దటండీ? ఆ కుంటిగుఱ్ఱంమీద కులాసా సవారికి పోటమేంటి?"

"సరే ఉన్నదది. ఏదో ఒకటి తప్పతుందా?"

"అదేం మాటుండి? నాకాడ బండి ఉందిగందా! ఎట్టా పోతది! "అయ్యగోరూ! ఇప్పటికయితే యేం మన బండికి రండంటిని. ఆయన ఇనుకుంటేనా? రూబెక్ గాడు అన్యాయంగా ఆయన్ని మోసంసేశాడు."

"అయితే నీ దగ్గర బండి, గుఱ్ఱం ఉన్నాయా?"

"ఓ ఉన్నాయండి. తమరుగాని దయ చేస్తారా?"

"మా ఇంగ్లీషు మిత్రుడు ఏదారిన పోయినాడో తెలుసా నీకు?"

యూదు ఇరుకున పడ్డాడు. చికాకుగా ముఖం పెట్టి, గడ్డం అరచేతితో రుద్దుకున్నాడు. సమాధానం 'ఏమి వస్తుందో'నని మార్గరెట్ అదిరిపోతున్నది. వాడు చాలాసేపు మాట్లాడకుండా అలాగే నిలబడ్డాడు. షావలిన్ చేసేదేమీ లేక వాడివంక చురచుర చూస్తున్నాడు.

యూదుడు తన మురికిచొక్కా జేబులోనుండి కొన్ని వెండినాణెములు బయటికి తీశాడు: "ఆయన గోరు ఆడి బండిలోపాయ్యే ముంగల నాకీ డబ్బులిచ్చి, ఎవరితోను సెప్పద్దన్నారండి" షావలిన్ ముఖం చిట్లించి, "ఎంత అది?" అని అడిగాడు.

"ఉన్నాయండి ఇరవై ఫ్రాంకులు. నే నెప్పుడూ ఇంతవరకు జల్మలో ఆడిదప్ప లేదుండి."

షావలిన్ తన జేబులోనుండి కొన్ని బంగారు నాణెములు తీశాడు. చేతిలో ఉంచుకొని గలగలలాడించాడు. "ఎన్ని ఉన్నాయో తెలుసా?" అని అడిగాడు.

యూదుని అదిరించి, బెదిరించి ప్రయోజనం ఉండదని షావలిన్ అనుకున్నాడు. గిలస్పిన్ పేరు చెప్తే వాడు లొంగి రాకపోడా. కాని అంతకన్నా వాడికి డబ్బు ఆశ చూపించి, మంచిచేసుకోవాలని షావలిన్ తలిచాడు.

ఆడబ్బు చూసేసరికి యూదు కన్నులు మిరుమిట్లు పొందినాయి. తొంగితొంగిచూస్తూ "అయిదారున్నట్లున్నాయండి." అన్నాడు.

"ఇవి చాలుతాయా నీవు ఆడితప్పేటందుకు?"

"ఏందో లెండిబాబూ! ఏం జెప్పమంటారు?"

"నీబండి మాకుకట్టు. మా మిత్రుడు పోయిన దోవనే పోయి నన్ను అతనిదగ్గరకు చేర్చాలి. అంతే."

"సిత్తం బాబుగారూ!"

"బ్లాంబార్డ్ శిథిలకుటీరందగ్గరకు పోవాలి."

యూదు ఆశ్చర్యపోయినాడు. కనులు విప్పారినాయి. "తమరికి తెలుసునే!" అన్నాడు.

"అది ఎక్కడో నీకు తెలుసా?"

"తెలుసునుండి."

"ఏదారిన పోవాలి?"

"సెంట్ మార్టిన్ రోడ్డెంట కొంత లెక్క పోవాలండి. ఆడనుండి కాలిబాట ఉంది. నేను రైటుగా తీసుకెళ్తానండి."

షావలిన్ తన చేతిలో ఉన్న నాణేలు యూదు మీదికి విసిరాడు. అతనిముఖం కళకళలాడిపోయింది. కిందికి వంగి ఏరుకున్నాడు. అందులో ఒకటిపోయి ఒక బీరువా క్రింద పడి, అతనిని చాలా చిక్కు పెట్టింది.

"బండి ఎంతసేపటిలో కట్తావు?" అని అడిగాడు షావలిన్.

"ఎంతో సేపా? ఇప్పటికిప్పుడు తమరు దయ చేయవచ్చునండి. బండి సూస్తారా?"

"వద్దులే."

"ఉంకోమాట సెప్పనాండి? ఆ రూబెక్ గాడి గుఱ్ఱం కదిలి సస్తుందే? దారిలోనే మనం ఆడి బండిని దాటెయ్యొచ్చండి. అసలు ఆమాటకొస్తే ఆబండి కోసెడుదూరంపోయాక ఆడ ముండికెయ్యదనా?"

"సరే నేను చెప్పేది శ్రద్ధగా విను. నీవు నన్ను మోసంచేశావా? మా భటులిద్దరిని తగిలించి నీవీపు వాయగొట్టిస్తాను. లేక మా మిత్రుడు గనుక కనిపించాడా నీకు మరొక పది బంగారు నాణెములు ఇస్తాము. ఇష్టమేనా?" అని అడిగాడు షావలిన్.

యూదుడు ఆలోచించాడు. చేతిలోఉన్న డబ్బు ఒకసారి చూసుకున్నాడు. షావలిన్ ముఖం ఒకసారి, డెస్ గాజ్ ముఖం ఒకసారి చూశాడు. "సరే." అన్నాడు.

"అయితే నీవుపోయి సిద్ధంగా ఉండు. వస్తున్నాము", అన్నాడు షావలిన్.

యూదుడు వినయంతో వంగి నమస్కరించి బయటికి పోయినాడు. (ఇంకా ఉంది)

# నాన్న మతిమరుపు

## సి. డి. యస్. రామయ్య

నాన్న ఆఫీసునుండి వచ్చారు. దుస్తులు మార్చుకుని, ముఖం కాళ్లు కడుక్కుని, ఈజీచేరులో వచ్చి కూర్చున్నాడు. అమ్మ, కాఫీ గ్లాసును చేతబట్టుకొని ఆయనదగ్గరికి వచ్చింది. ఏదో ఆలోచనలలో వున్న నాన్న అమ్మ పలకరించేవరకూ గుర్తించలేకపోయాడు.

"కాఫీ తీసుకోండి!" అంది అమ్మ.

నాన్న తేరుకుని, కాఫీ గ్లాసును అందుకుని, నాలుగు గుక్కలు కాఫీ తాగి, ముఖాన్ని నాలుగు వంకలు చేసుకున్నాడు. "అబ్బబ్బ! ఏం కాఫీ నీళ్లే యివి? - దీనికంటే సొంటినీళ్లు పెట్టివ్వరాదూ!" అన్నాడు, కాస్త కోపంతో.

"నన్నేం చేయమంటారండీ? - కాఫీపొడుం అయిపోయిందనీ, ఆఫీసునుండి వస్తూ పట్టుకురమ్మనీ - వుదయమే చెప్పానుగా! - మీరు వినిపించుకుంటేనా?" అని మూతి విరుచుకుంది అమ్మ.

నాన్న ముఖం యెర్రబారింది: "ఎప్పుడూ లేదనే పాట తప్ప, మరేం తెలుస్తుందిలే నీకు! - అంతా నా దురదృష్టం!-" అంటూ లేచాడు.

నెలాఖరు రోజులు కాబట్టి యే సంసారంలోనైనా — యిలాంటి ఘర్షణలు జరుగుతూనే వుంటాయి!

"విశ్వం! విశ్వం!!" అంటూ తమ్ముడ్ని కేకలేశాడు నాన్న. కాని, వాడు యింట్లో వుంటేనా?- ఫుట్‌బాల్ ఆడటమే వాడి ప్రతి సాయంత్రపు కార్యక్రమం.

"వాడు యిప్పుడే ఆడుకోడానికి వెళ్ళాడు నాన్నా!" అని నాన్నకు సమాధానం యిచ్చాను నేను.

"చస్తున్నవాళ్లు చస్తుంటే, ఈ వెధవకి ఆటలు కావాలిసొచ్చింది!" గొణుగుకున్నాడు నాన్న; "కాఫీ పొడుం తెప్పిద్దామనుకున్నా, మనుషులు లేరు. అన్నిటికీ నేనే తిరిగి చావాలి."

పై కండువా భుజా నేసుకుని, డబ్బుకోసం కాబోలు — బీరువా తెరిచాడు నాన్న. అయిదు నిమిషాల పాటు బీరువా అంతా గాలించి, పిదప — "ఏమేవ్" అంటూ గట్టిగా కేకేశాడు. అమ్మ పరుగెత్తు కొచ్చింది.

"నెలాఖరున చిల్లర ఖర్చులకి యిబ్బందిగా వుంటుందని - అయిదు రూపాయలు అప్పు తీసుకొచ్చి - బీరువాలో వుంచితే కనిపించడం లేదు...నువ్వేమేనా తీశావా?" అని అడిగాడు నాన్న.

"అబ్బే! నేను చూడనైనా లేదు." అంది అమ్మ.

"ఏరా, రామం! నువ్వేమైనా చూశావూ?" అని నన్నడిగాడు నాన్న.

"లేదు నాన్నా!" అన్నాను నేను.

"అయితే, యేమైనట్టు?— బీరువా తినేసిందా? లేక దొంగలెత్తుకుపోయారా? వెధవసంసారం! ఇన్నాళ్ళకి దొంగతనం జరగడం కూడా ప్రారంభమైందీ!" అంటూ పొలికేకలు ప్రారంభించాడు నాన్న.

"అలా అరవడం దేనికండీ! పెట్టినచోటు బాగా గుర్తు చేసుకుని, వెతికి చూడండి మరి!" అంది అమ్మ.

"గుర్తేమిటే? - మహా చెప్పొచ్చావు గానీ, నోరు మూసుక్కూచో......" అని, నిమిషం తర్వాత "ఆఁ!— ఆ తుంటరిగాడే యెత్తివుంటాడు. రానీ, వాడి పని పట్టిస్తాను" అని అన్నాడు నాన్న.

"మరీ బాగుంది; వాడేం చేశాడనీ?" అని అడిగింది అమ్మ.

"ఏం చేశాడా! - కళ్లు మూసుకుంటే, ఈ కొంపనే ముంచేస్తాడు వెధవ! వాడి క్లాసు పుస్తకాలేవో 'సెకండ్‌హాండ్'వి దొరికాయనీ, కొనుక్కోడానికి డబ్బివ్వమనీ అడిగాడు. ఇప్పుడు లేదంటే విన్నాడూ? బీరువా వెదికి కాజేసివుంటాడు..." అంటూ కోపంగా ఈజీచేర్‌లో పడుకున్నాడు.

ఏం సమాధానం యివ్వాలో, ఏం చెయ్యాలో తోచక, అమ్మ నావేపు ఒకసారి చూసి లోపలికి వెళ్ళిపోయింది.

#  నాన్న మతిమరుపు 

సంధ్యవేళ గడిచిపోయినతరువాత చెమటలుపోసిన శరీరంతో యింటి కొచ్చాడు విశ్వం. వస్తూనే చొక్కా-తీసి, దండెంమీద పడేశాడు. అంతసేపూ వాడికోసం కాసుకు కూర్చున్న నాన్న - లేచి, చూరులోనున్న బెత్తాన్ని తీసుకుని వాడివద్దకు వచ్చాడు. అంతవరకూ ఆనందరేఖలు అలముకొని వున్న విశ్వం ముఖం - నాన్న రౌద్రాన్ని చూసి, పాలిపోయింది. బెదురుగా ఆయనవేపు చూశాడు.

"ఏరా, వెధవా! - బీరువాలో అయిదు రూపాయలు తీశావా లేదా?" అని అడిగాడు నాన్న.

"అదేమో - నాకు తెలీదు నాన్నా!" అన్నాడు విశ్వం, తడబడుతూ.

"తెలీదూ!" అంటూ ఛెళ్లున వాడి వీపుమీద బెత్తాన్ని మోగించాడు నాన్న: "నిజం చెప్పు వెధవా! - చర్మం వొలిచేస్తాను. తీశావా లేదా?"

"లేదు నాన్నా, నేను తీయ లేదు."

"అబద్ధాలాడుతావ్ - " అంటూ విశ్వం చేతులమీదా, కాళ్ళమీదా బెత్తంతో కొట్టసాగాడు నాన్న. అమ్మ లోపలినుండి వచ్చి నాన్నని వారించబోయింది. ఆ సందర్భంలో అమ్మకీ నాలుగు దెబ్బలు తగిలాయి. నాన్నకున్న కోపంలో, అడ్డు తగలడం అంత మంచి పని కాదని నాకు తెలుసు. కాని, తమ్ముణ్ణి కొట్టడం చూసి సహించ లేకపోయాను...

నాన్న కొడుతూనే వున్నాడు; విశ్వం ఒంటిమీద వాతలు పడుతున్నాయి; వాడు పెద్దగా యేడుస్తున్నాడు. నాన్నని వారించడానికి భయపడి, అమ్మ కంట నీరు పెట్టుకుంటోంది.

"నిజం చెప్పేంతవరకూ - నీ కండల్ని చీల్చేస్తాను వెధవా! - చెప్పు, నిజం చెప్పు...పుస్తకాలకి డబ్బు కావాలని, ఆ అయిదురూపాయలూ నువ్వు తీయలేదూ?" అంటూ బెదరిస్తున్నాడు నాన్న.

దెబ్బలకి భయపడిపోయాడు విశ్వం. నిజంగా తను తీయక పోయినా, డబ్బు తీశానని ఒక్క-అబద్ధం చెప్పితే, దెబ్బలైనా ఆగిపోతాయనే తలపుతో "అవున్నాన్నా! - తీశాను, నేనే ఆ డబ్బును తీశాను!" అని గొణిగేశాడు విశ్వం. ఇంతలో అమ్మ వాణ్ణి లోపలికి లాక్కు-వెళ్లిపోయింది.

విశ్వం చెప్పిన ఆ సమాధానానికి నాన్న తృప్తిచెందాడు కాబోలు! బెత్తాన్ని అవతల పారేసి, ఈజీ చేరులో కూర్చోబోయాడు. ఇంతలో వీధినుండి "రామనాథం!... ఉన్నారా?" అంటూ అవధాన్లు గారు యింట్లోకి వచ్చారు. అవధాన్లుగారూ, నాన్నా - ఒకే కంపెనీలో వుద్యోగం చేస్తూన్న మిత్రులు.

విశ్వం యేడుపునుగురించి ప్రశ్నించాడు అవధాన్లుగారు. జరిగినదంతా చెప్పాడు నాన్న.

అవధాన్లుగారు - "అరెరె! - ఏమనిపించయ్యా నువ్వు, రామనాథం! పాపం! నీ మతిమరుపుతనం వల్ల, ఏపాపమెరుగని కుర్రాడిమీద నేరంమోపి, చావమోదుతావా?-" అన్నాడు కాస్త కఠినంగా.

"ఏమిటి, నువ్వంటున్నదీ?" అని అడిగాడు నాన్న - ఆశ్చర్యంగా.

"నీ తలకాయ! - " అని కసిరాడు అవధాన్లుగారు: "మతిమరుపుతనంతో నువ్వు అయిదురూపాయల కాగితాన్ని వారపత్రికలో వుంచి, అది గమనించకుండా చదువుకోడానికి అడిగిన నాకు ఆ పత్రికని ఇచ్చేశావు! - ఇంటికి వెళ్ళి చూస్తే పత్రికలో అయిదురూపాయల కాగితం కనిపించింది. అది యిచ్చిపోడానికే వచ్చాను!" అంటూ అయిదురూపాయిల కాగితాన్ని నాన్నకిచ్చాడు.

నాన్న మాట్లాడలేదు. మతిమరుపుతనంవల్ల- తను చేసిన నేరానికి, ఆవేశంతో ఏపాపమెరుగని విశ్వాన్ని వాతలుపడేలా కొట్టినందుకు నాన్న మనస్సు బాధపడిందికాబోలు! ఆయన కళ్ళలో నీళ్లు తిరిగాయి! 

# "బాలానాం రోదనం బలం"

కొన్ని వేల సంవత్సరాల క్రిందట భారతదేశంలో ఒక గొప్ప వీరుడు ఉండేవాడు. అతని పేరు విశ్వజిత్తు. ప్రపంచాన్నంతటినీ అతడు జయించాడు. అతడు ఎంతటి బలవంతుడు అంటే ఒక వెయ్యి సింహాలు, ఒక వెయ్యి ఏనుగులు ఎదుర్కొన్నా సరే, అన్నిటినీ ఓడించగలవాడు. రాక్షసులను, దేవతలను, మనుష్యులను అందరినీ ఓడించి విశ్వజిత్తు అనే బిరుదు పొందాడు. భూమి, వాయువు మొదలైన పంచభూతాలను, కామ క్రోధాది అరిషడ్వర్గాన్ని జయించాడు. అతడు జయించనిది, అతనికి లోబడనిది ఇక ఏదీ లేదు. పరమసంతుష్టితో, ప్రజలను కన్న బిడ్డలవలె చూసుకుంటూ విశాల సామ్రాజ్యాన్ని పాలిస్తున్నాడు.

ఒకరోజున అతనివద్దకు నలుగురు మనుషులు వచ్చారు. "ఏం కావాలి మీ"కని విశ్వజిత్తు అడిగాడు.

"నేను బీదవాణ్ణి. నాకు చాలమంది పిల్లలున్నారు. కుటుంబాన్ని పోషించలేకపోతున్నాను," అని ఒకడు అన్నాడు.

"నాకు సిరి సంపద లున్నాయి గాని సంఘంలో గౌరవం లేదు," అన్నాడు రెండోవాడు.

"నాకు సిరిసంపదలు, సంఘ గౌరవం ఉన్నాయి గాని క్రోధం చాలా ఎక్కువ. క్రోధం వచ్చినప్పుడు నన్ను నేను అదుపులో పెట్టుకోలేక పోతున్నాను. దీనివల్ల నాకు మనశ్శాంతి లభించకుండా ఉన్నది," అన్నాడు మూడోవాడు.

"నాకు ఏ కొఱతా లేదు గాని నేను పొట్టివాణ్ణి. అందరూ నన్ను పొట్టివాడని చులకనచేస్తున్నారు," అని నాలుగోవాడు అన్నాడు.

విశ్వజిత్తు వారి కోరికలను సావధానంగా విన్నాడు. అతడు పరమ దయాళువు. ఎవ రేది అడిగినా లేదనకుండా ఇచ్చే స్వభావం గలవాడు.

వారికి ఒక్కొక్కరికీ ఒక్కొక్క చిన్న భరిణె ఇచ్చాడు. అందులో ఉన్న మందు ఇంటికి వెళ్లిన తరువాత వంటికి రాసుకోమని సలహా ఇచ్చాడు.

మొదటి ముగ్గురూ అలానే చేశారు. ఇంటికి వెళ్ళి మందు వంటికి రాసుకున్నారు. మొదటివాడు కొద్దిరోజుల్లో అదృష్టం కలిసివచ్చి గొప్పభాగ్యవంతుడయ్యాడు. రెండోవాడు సంఘపూజితుడయ్యాడు. మూడోవాడు క్రోధాన్ని అణచుకొని శాంత స్వభావుడయ్యాడు.

నాలుగోవాడు భరిణె పుచ్చుకుని ఇంటికి వెడుతూ ఒక అడవిదారిలో ఆగి, ఆత్రుత పట్టలేక మందు తీసి రాసుకున్నాడు. అంతే. అతడిక ఎవరికీ కనిపించక అతడు నుంచున్నచోట ఒక ఎత్తయిన వృక్షం మొలిచింది. ఆ అడవిలోకల్లా ఎత్తయిన చెట్టుగా అది పెరిగింది. విశ్వజిత్తు సలహాకు విరుద్ధంగా చేసినందున అతని కా ప్రతిఫలం లభించింది.

ఈవిధంగా అతని కీర్తి దశదిశలా వ్యాపించింది. ఒక రోజున అతనివద్దకొక స్త్రీ వచ్చింది. "ఏం కావా"లని విశ్వజిత్తు అడిగాడు.

"మహాప్రభూ! మీరు ప్రపంచాన్నంతటినీ జయించారని అందరూ భావిస్తున్నారు. కాని మీరు జయించనివాడొకడున్నాడు," అన్నది ఆమె.

విశ్వజిత్తు ఆశ్చర్యపడ్డాడు. "ఎవడు వాడు? ఎక్కడ ఉంటాడు? ఎలా ఉంటాడు?" అని ప్రశ్న పరంపర కురిపించాడు.

"నేను చెబితే మీరు నమ్మరు. మీరే స్వయంగా చూద్దురు గాని నా వెంట రండి. అతన్ని ఏ మానవుడూ జయించలేడు," అన్నది ఆ స్త్రీ.

విశ్వజిత్తుకు ఆమె మాటలతో కొంచెం కోపం కలిగింది. కాని అంతకంటె ఎక్కువగా ఆశ్చర్యం కలిగింది. ఇన్నేళ్ళ రాజ్యపాలనలో తన నీవిధంగా ఎవరూ అన సాహసించలేదు. ఇప్పుడొక సామాన్య

## ★ "బాలానాం రోదనం బలం" ★

స్త్రీ వచ్చి ఇలా ఈసడిస్తున్నది. తనకు లొంగని ఆ బలవంతు డెవడు. ఇంతకాలం అటువంటి వాడొకడు ఉన్నాడన్నైనా తాను వినలేదే?

తన ప్రత్యర్థి ఎంత ఎత్తున, ఎంతలావున ఉంటాడో, రాక్షసుడో దేవతయో చూడాలనే ఆసక్తితో ఖడ్గ, కవచ, శిరస్త్రాణధారియై విశ్వజిత్తు ఆ స్త్రీ వెంట వెళ్లాడు. ఆమె అతన్ని తన ఇంటికి తీసుకుపోయింది. నట్టింట్లో ఆటవస్తువులతో ఆడుకొంటున్న అందమైన తన పుత్రుణ్ణి చూపించింది. "వీడే" అని మహారాజుతో అన్నది.

విశ్వజిత్తు ఫకాలున నవ్వాడు. "వీడా నా ప్రత్యర్థి!" అన్నాడు.

"ఇలా రా అబ్బాయ్" అని బాలుణ్ణి పిలిచాడు.

బాలుడు బొటనవేలు నోట్లో పెట్టుకుని చీకుతూ "నీ లెక్కేమిటి పోవోయ్" అన్నట్టు చూశాడు.

విశ్వజిత్తు ఆశ్చర్యపడ్డాడు, తను ఆజ్ఞాపించడం, ఒక బాలుడు నిరసించడమూ అని. ఇంకా కొంచెం గట్టిగా రమ్మని పిలిచాడు. బాలుడు పక్కన ఉన్న గరిటె తీసుకుని విసిరేశాడు. అది సరాసరి వచ్చి విశ్వజిత్తు ముఖానికి కొట్టుకుంది.

విశ్వజిత్తు మహోగ్రుడైపోయాడు. ఎన్నడూ కోపంరాని అతనికి పట్టరాని ఆవేశం వచ్చింది. "ఎవరనుకుంటున్నావురా నన్ను?" అని భూమండలమంతా అదిరిపోయేటట్లు, వెయ్యి పిడుగు లొక్కసారి పడినట్లు అరిచాడు. ఆ అరుపుతో బాలుడు హడలిపోయి బావురుమని ఏడుపు లంకించుకున్నాడు. ఇల్లెగిరిపోయేటట్లు, ఇల్లేమిటి ఆకాశమే ఎగిరిపోయేటట్లు ఏడవసాగాడు. విశ్వజిత్తు కోపపడినకొద్దీ ఇంకా ఎక్కువగా ఏడుస్తున్నాడు. దగ్గిరికి రమ్మంటే రాడు. పోనీ ఎత్తుకుని ఊరుకోరా అంటే ఊరుకోడు. గిలగిల తన్నుకోవడం, గింజుకోవడం, రక్కడం, బరకడం సాగించాడు. వాడి ఏడుపు కర్ణకఠోరంగా, సీనా రేకులు బర్రున నేలమీద గీచినట్లు గుండెలను ఝల్లు మనిపిస్తున్నది. విశ్వజిత్తు ఎంత ప్రయత్నించినా ఆ బాలుడి ఏడ్పు మాన్పలేకపోయాడు. ఇక అక్కడ నిలవలేక "నీకూ, నీ ముద్దుల కొడుక్కూ వెయ్యి దండాలు" అని పారిపోయి వచ్చేశాడు.

చూశారా? విశ్వాన్ని అంతటినీ జయించిన విశ్వజిత్తు ఒక ఏడాది పాపడి చేతులో ఓడిపోయాడు! అందుకే లోకాన్ని గెలువవచ్చుగాని పిల్లలతో దెబ్బలాడి గెలువలేము. విశ్వజిత్తువంటి వాడే ఈ విషయంలో ఓడిపోతే మనం ఒక లెక్కా? ★

---

చైనీస్ కథలు - ఫెంగ్ స్వే ఫెంగ్:

# 3. న్యాయం కోసమే కళ

మృత్యుదేవత మందిరంవంటి పుట్టలోనుండి భయంకరమైన కృష్ణసర్పం బయటికి వచ్చి పడగఎత్తి చూచింది. పుట్టదిగువ అమాయికంగా ఆహారం ఏరుకుంటున్న క్రౌంచపక్షి కనబడింది. సర్పం జర్రున ప్రాకిపోయి దాన్ని కాటువేసి చంపింది.

చెట్టుమీద పిల్లలకు ఆహారం పెడుతున్న పెంటిపిట్ట భర్త ఆకస్మిక మరణానికి అమితంగా దుఃఖింపసాగింది. హృదయవిదారకంగా విలపించింది. అలా చాలసేపు ఏడ్చి ఏడ్చి తన భర్తను చంపిన దుష్టసర్పంపై క్రోధంతో ఆక్రోశించింది. పెంటిపక్షి దుఃఖాక్రోశంతో అరణ్యమంతా ప్రతిధ్వనించింది. మనోహరమైన వసంతఋతువులో కలకలలాడవలసిన అరణ్యం ఈ విషాదసంఘటనతో ఆత్మీయులు చనిపోయిన గృహంలాగా నిశ్శబ్దంతో బరువెక్కింది.

ఆ దారినపోతున్న ఒక గాయకుడు క్రౌంచపక్షి ఆక్రోశం విన్నాడు. అతని హృదయం కరుణతో ఆర్ద్రమైంది. "నా హృదయం ఎందుకిలా వేదన పొందుతున్నది? ఈ వేదనను గానంగా మార్చగలిగితే ఎంత బాగుంటుంది?" అనుకున్నాడు.

వేణువుతీసి తనలోకలిగిన మానవేదనను గానంగాఆలపించసాగాడు. దుస్సహమైన దుఃఖంతో, తీవ్రమైన ప్రతీకారభావంతో అతని వేణుగానం వాడవాడలా ధ్వనించింది. చలి వణకించే ప్రాతఃకాలానగాని, నిశ్శబ్దపురాత్రులగాని, పనులతొందరలో మునిగిన పగటివేళగాని ఎప్పుడు, ఎవరు ఆ పాట విన్నా దుఃఖంతో, కోపంతో ఊగిపోయేవారు; సజ్జనులకు హానిచేసే కృష్ణసర్పాన్ని వెదకడానికి బయలుదేరేవారు; సర్పం కనిపిస్తే చాలు, కొట్టి చంపివేసేవారు. అందుకే క్రౌంచపక్షిని చంపినది అయినా

# బొంబాయి సినిమా లేఖ

భారతీయ నిర్మాతలు విదేశీయులతో కలిసి సంయుక్తంగా చిత్రనిర్మాణానికి సంకల్పించడం క్రమంగా అధికమవుతున్నది. ఫిల్మిస్తాన్ వారు భారతీయ, విదేశీయ నటులతో తీస్తున్న "బొంబే ఫ్లయిట్ 417" చిత్రం కాక, భారత రష్యన్ నిర్మాణాలు మరికొన్ని ఇటీవల వెల్లడి అయినవి. ఉభయ దేశ ప్రభుత్వాల సహకారంతో ఈ చిత్రాలు నిర్మింపబడతాయి. నిర్మాత అబ్బాస్ భారతీయ, రష్యన్ తారలతో ఒక చిత్రం తీస్తానని ప్రకటించారు. నర్గీస్, రష్యన్ నటుడు చెర్కాసోవ్ ఈ చిత్రంలో నటిస్తారు. ఈ చిత్రం ఉభయ దేశాలలోనూ తయారవుతుంది. మొగల్ సామ్రాజ్య కాలంలో భారతదేశానికి వచ్చిన ఒక రష్యన్ యాత్రికుని అనుభవాలను ఈ చిత్రం రూపొందిస్తుంది.

ప్రధాని నెహ్రూ రచించిన "భారత దర్శనం" (డిస్కవరీ ఆఫ్ ఇండియా) గ్రంథాన్ని హిందీ, రష్యన్ భాషలలో చిత్రీకరించడానికి బిమల్ రాయ్ ప్రయత్నాలన్నీ పూర్తిచేశారని తెలుస్తున్నది. ఈ చిత్రంలో కొంత భాగాన్ని రష్యన్ స్టూడియోలలోనే షూట్ చేయడానికి ఆయన నిశ్చయించారు. ఈ నిర్మాణంలో భారత, రష్యన్ ప్రభుత్వాలు బిమల్ రాయ్‌కి అన్ని సదుపాయాలూ కలగజేస్తాయని తెలుస్తున్నది.

ఇవికాక, చేతన్ ఆనంద్ ఇటీవల మరొకటి వెల్లడించారు. చైనీస్ బౌద్ధ విద్వాంసుడు, యాత్రికుడు అయిన యువాన్ చ్వాంగ్ భారతదేశ యాత్రను చిత్రీకరించడానికి ఆయన సంకల్పించారు. హిందీ, చైనీస్, రష్యన్ భాషలలో, మూడు దేశాల ఫిలిం పరిశ్రమల సహాయంతో ఆయన ఈ నిర్మాణం సాగిస్తారట. యువాన్ చ్వాంగ్ పాత్రను చైనీస్ నటుడే ధరిస్తాడట.

ఈ ప్రయత్నాలన్నీ ప్రశంసాపాత్రమైనవి కావలసినవే. ఇవన్నీ ఎంతవరకూ యథార్థాలవుతాయో వేచి చూడాల్సిందే.

* * *

"బొంబే ఫ్లయిట్ 417" చిత్ర నిర్మాణం నాటినాటికి జరిగే మార్పులతో ఆలస్యమవుతున్నది. మొదట బీనారాయ్ నటిస్తుందని అనుకున్నారు. కాని ఆమె మరీ స్థూలంగా ఉండడంవల్ల ఆమెను నిరాకరించవలసి వచ్చిందని నిర్మాత విక్టర్ కటోనా, డైరెక్టర్ కతోనా చెబుతున్నారు. నర్గీస్‌ను బుక్ చేయదలచగా ఆమె ఈ చిత్రం భారతీయ సంప్రదాయాలకు అవమానకరంగా ఉన్నదని నిరాకరించిందట. ఇద్దరు భారతీయ స్త్రీలు ఒక అమెరికన్ వైమానికుణ్ణి అతడు బొంబాయి వచ్చీరాగానే ప్రేమించడం ఈ చిత్రంలో ముఖ్యసంఘటన. కొత్త సంస్కారం కలిగిన కులీనయువతి ఎవరూ ప్రేమించదగినంత ఆకర్షణ అమెరికన్లలో లేదని నర్గీస్ అభిప్రాయమట. చివరికి ఆ పాత్రకు వినీతాబోస్ బుక్ అయింది. ఆమెకు ఉన్న సినిమా అనుభవమల్లా "మిస్టర్ అండ్ మిసెస్ 55" లో ఒక చిన్న పాత్రయే.



సినీతార పద్మిని.

---

చంపినది కాకపోయినా, ప్రతి విమర్శానికీ చావు తప్పదు.

నీతి:—న్యాయాన్ని ఉద్ధరించడానికీ, అన్యాయాన్ని అణచివేయడానికీ మానవులను పురికొలిపేదే కళ.





సావిత్రి లాస్యం

(ఎ. వి. ఎమ్. వారి చిత్రం "వదిన"లో)

# బొంబాయి సినిమాలేఖ

మరొక యువతి పాత్రకు వైజయంతీమాల మొదట బుక్ అయింది. కాని ఆమెకూడా మానుకున్నది. చివరికి సూర్యకుమారి బుక్ అయినది.

మొదటి దృశ్యాలను షూట్ చేసిన ఫోటోగ్రాఫరుకూడా 'గుడ్ బై' చెప్పి వెళ్ళిపోయాడు. అదృష్టవశాత్తూ మరొక ఫోటోగ్రాఫరు దొరకడంవల్ల షూటింగ్ సాగిపోతున్నది.

* * *

బెంగాలీతార సుమిత్ర బొంబాయి, కలకత్తా నగరాల్లో మొత్తం మూడు చిత్రాల్లో ఒకేసారి నటిస్తోంది. ఇప్పుడామె విశ్రాంతి కోసం నైనిటాల్ వెళ్ళింది. ఆమె బొంబాయిలో నటించే పెద్ద చిత్రం "గునా". ఇందులో అశోక్, కిశోర్, అనూప్ కుమార్లు ముగ్గురూ నటిస్తున్నారు. అశోక్ కుమార్ భార్యగా సుమిత్ర నటిస్తోంది.

* * *

షాహిద్ లతీఫ్ నిర్మిస్తున్న "సోసైటీ" అనే చిత్రంలో ఆత్మగౌరవం కలిగి అవినీతికి లొంగని ఒక పత్రికారచయిత కథానాయకుడు. ఈ చిత్రంలో మినూ అనే కొత్త నర్తకి మొదటిసారిగా నటిస్తోంది. ఈమె ఫిలిం నర్తకుడు ముంతాజ్ అలీ కుమార్తె. బొంబే టాకీస్ వారి అనేక చిత్రాల్లో నటించి ప్రసిద్ధికెక్కిన ముంతాజ్ అలీ ఇప్పుడు సినిమాలనుండి విరమించుకున్నాడు. కాని అతని కుమారుడు మహమూద్ ఇప్పుడిప్పుడే సినీనటుడుగా పేరు పొందుతున్నాడు. కుమార్తె మినూ చక్కని నర్తకి అని ప్రతీతి.

* * *

ఆర్. ఎస్. ఫిల్మ్సువారి "సౌ కా నోట్" ఈమధ్య విడుదల అయింది. గీతాబాలి, కరణ్‌దివాన్, బేగంపారా, కృష్ణకుమారి, మనోరమ, రామ్‌సింగ్, జబీన్, చిత్రా, స్మృతిబిశ్వాస్, చాంద్ ఉస్మాని, మోహనా మున్నగువారు నటించారు. భారతీయ ఫిలిం పరిశ్రమకు సంబంధించిన వ్యంగ్యచిత్రం. ప్రాథమిక విలువలు, ప్రెజెంట్‌మెంట్ బాగుగా ఉన్నా, ఉత్కంఠ కలిగించే కథ, హాస్య సన్నివేశాలు, మంచి నటన, సంభాషణలు, మంచి సంగీతం ఉండటంచేత ప్రేక్షకులను విరివిగా ఆకర్షిస్తోంది.

మీనాకుమారి, ప్రదీప్‌కుమార్, దల్జీత్, సప్రూ, దుర్గాఖోటే, రూపమాలా, కుంకుం నటించిన "అదల్-ఇ-జహాంగీర్" కూడా ఈమధ్య బొంబాయిలో విడుదల అయింది. నిర్మాత, దర్శకుడు జి. పి. సిప్పీ. జహాంగీర్ చక్రవర్తి న్యాయపరిపాలనం, అతని కుమారుడు ఖుర్రం ఒక సామాన్య పౌరుని భార్యను తిరస్కరించినప్పుడు జహాంగీర్ ఎదుర్కొన్న సమస్య ఈ చిత్రంలో కథావస్తువు. ఫోటోగ్రఫీ, దర్శకత్వం ఏమీ బాగా లేవు. సంగీతం మాత్రం బాగా వున్నది.

(ఆంధ్రవారపత్రిక విలేఖరి) ★



రేలంగి హాస్యం

(ఎ. వి. ఎమ్. వారి "వదిన"లో)

# బాలచిత్రాల నిర్మాణం

పిల్లల చిత్రాల నిర్మాణాన్ని ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చాలని బాల చిత్ర సంఘ కార్యవర్గంవారు కేంద్ర ప్రభుత్వానికి సిఫార్సు చేశారు. పండిట్ హృదయనాథ కుంజ్రూ అధ్యక్షతన ఇటీవల సమావేశమైన ఈ కార్యవర్గంవారు వచ్చే ఏడాది వేసవిలో ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, మద్రాసు నగరాల్లో అంతర్జాతీయ బాలచిత్రోత్సవాలు జరపాలని, 1956 మార్చిలోగా రెండు బాలచిత్రాలు నిర్మించాలని కూడా నిర్ణయించారు. ఈ చిత్రాలకు తగిన కథలను పంపవలసిందని దేశంలోని రచయితలకు ఆహ్వానాలు పంపాలని వారు నిర్ణయించారు. వచ్చినవాటిలో మంచివాటిని మూడింటిని ఎంచి ఒక్కొక్కదానికి రూ. 1000 పారితోషికం ఇస్తారు. కథలను ఎంచడానికి ఓ. జి. ఖేర్, సమర్ ఛటర్జీ మున్నగువారితో కూడిన ఒక సంఘాన్ని ఏర్పాటుచేశారు.

6-11 మధ్య వయస్సుగల పిల్లలను ఒక తరగతిగాను, 11-15 మధ్య వయస్సుగల

# బాల చిత్రాల నిర్మాణం

పిల్లలను మరొక తరగతిగాను విభజించి వారిని దృష్టిలో పెట్టుకొని చిత్రాలు తీయాలని వారు నిర్ణయించారు. తగిన నిర్మాతల జాబితా తయారుచేసేందుకు బి. ఎన్. సర్కార్, వి. శాంతారాం, కె. సుబ్రహ్మణ్యంగార్లతో కూడిన ఒక సంఘం ఏర్పాటుచేశారు.

1956-61 మధ్య 25 దీర్ఘచిత్రాలను, 25 చిన్నచిత్రాలను, భారతీయ విదేశీయ చిత్రాలకు 35 అనువాదచిత్రాలను 40 లక్షల రూ. ల ఖర్చుతో తీయాలనీ, దీన్ని భారత ప్రభుత్వమే భరించేటట్లు కోరాలని వారు తీర్మానించారు. మహేంద్రనాథ్ గార్ని బాలచిత్ర సంఘ కార్యదర్శిగా నియమించారు.

కేంద్రప్రభుత్వపు ఫిల్మ్స్ డివిజన్‌వారు పిల్లలకోసం చిన్నచిత్రాలను నిర్మించడానికి నిశ్చయించారు. కార్టూన్ చిత్రనిర్మాణాన్నికూడా వారు సంకల్పించారు.

# "జాగృతి సమీక్ష"

ఫిల్మిస్తాన్ కంపెనీవారి హిందీ చిత్రం "జాగృతి" 8వ తేదీనుండి మద్రాసు, స్టార్ టాకీస్‌లో ప్రదర్శింపబడుతున్నది. బాలురకు విద్యాబోధించే పద్ధతులలోను వారియెడ ఉపాధ్యాయులు అవలంబించే విధానాలలోను మార్పులు రావాలని, పాతపద్ధతుల వలన లాభంలేదని సందేశంఇచ్చే ఈ చిత్రానికి సత్యేన్‌బోస్ దర్శకుడు. సత్యేన్



"సర్దార్" చిత్రంలో అశోక్‌కుమార్.



నేషనల్ ఆర్ట్‌వారి "జయసింహ"లో రుద్రసింహుడుగా రంగారావు, దుర్గాదేవిగా ఋష్యేంద్రమణి.

బోస్, బెంగాలీలో తీసిన చిత్రం దీనికి మాతృక. ఇది హిందీలోకూడా విజయవంతంగా నడిచింది. గంభీరమైన ఇతివృత్తాలనుతీసుకుని చిత్రాలు నిర్మించడంలో బెంగాలీ దర్శకులు సిద్ధహస్తులని ఈ చిత్రం ఋజువుచేస్తుంది. ఇందులో అభిభట్టాచార్య, రాజ్‌కుమార్ గుప్త, రతిన్‌కుమార్, ప్రణతీఘోష్, బిపిన్ గుప్త మున్నగువారు నటించారు.

ఉన్న తెలివితేటలను అల్లరి చిల్లరిగా చెడ్డ సాహసాలు చేసి, దుర్వినియోగం చేసే అజయ్ అనే బాలుడు శేఖర్ అనే ఉపాధ్యాయుని ఆదరణవలననూ, శక్తి అనే తోటి విద్యార్థి ఆత్మత్యాగంవలననూ ఏవిధంగా సవ్యమార్గావలంబి అయినదీ ఈ చిత్రంలో ప్రధానంగా చూపబడింది. సంగీత దర్శకుడు హేమంతకుమార్. ఉన్నవి నాలుగే పాటలయినప్పటికీ చక్కగా ఉన్నాయి.

అధిక సన్నివేశాలు కథాప్రయోజనానికి దోహదం చేసేవిగా లేవు. అల్లరివాడైన అజయ్‌లో పరివర్తన కలగడానికి ముఖ్య కారణం శక్తి అనే బాలుడు ఆకస్మికంగా కారుకిందపడి చనిపోవడం అని చూపించడంలో కథకొంత మూలప్రయోజనానికి దెబ్బ తగిలింది. విద్యాబోధన పద్ధతులను సంస్కరించితే బాలుర ప్రవర్తనలో పరివర్తన కలుగుతుందని చెప్పడం అసలు ఉద్దేశ్యం. దానికి ఈ చిత్రంలో చివరి సన్నివేశాలవలన భంగం కలిగింది. అక్కడకు వచ్చేసరికి ఈ చిత్రం మామూలు కథల స్థాయిలోకిదిగింది. మెలోడ్రామా లేకుండా సమస్యలను చిత్రించడం మనవారికి ఇంకా అలవడని విద్య అనిపిస్తుంది. ఈమాదిరి [illegible]

బిమల్ రాయ్‌గారి "అమానత్" చిత్రంలో భారత్ భూషణ్, పాల్ మహేంద్ర.

తోనే తీయబడిన ఇటాలియన్ చిత్రం "టుమారో ఈజ్ టూ లేట్"లో బాల బాలికల విద్యార్థుల మనస్తత్వాలను, వారి యెడ అవలంబించవలసిన పద్ధతులను ఎంత వాస్తవికంగా చిత్రించారో చూస్తే ఈ చిత్రంలోని విలివ కనబడుతుంది.

కాని మన చిత్రాలకు సంబంధించినంత వరకూ "జాగృతి"ని ఉత్తమ చిత్రాల జాబితాలో చేర్చవచ్చు. 

## ఎ. నాగేశ్వరరావుకు ఢిల్లీలో సన్మానం

ఈ వేసవిలో విశ్రాంతికోసం కాశ్మీర్ వెళ్లిన ఎ. నాగేశ్వరరావు గారికి ఈనెల 9.వ తేదీ సాయంత్రం న్యూఢిల్లీనగరంలో ఢిల్లీ ఆంధ్రసంఘంవారు సన్మానం చేశారు. పార్లమెంటు సభ్యులు పి. సుబ్బారావు గారు సభకు అధ్యక్షత వహించారు.

ఎ. నాగేశ్వరరావుగారు తమకు జరిగిన సత్కారానికి కృతజ్ఞత తెలుపుతూ, తమ సినిమా అనుభవాలనుగూర్చి ప్రసంగించారు. తమ 19వ ఏటనే సినిమారంగంలో ప్రవేశించాననీ, 9 సంవత్సరాల కాలంలో 50 సినిమాలలో నటించాననీ, మొదట్లో స్త్రీపాత్రలు ధరించేవాడిననీ ఆయన చెప్పారు. ఢిల్లీలో ఆంధ్రులకు తెలుగుసినిమాలు చూసే అవకాశం లేదు కనుక, తెలుగుచిత్రాలను ఢిల్లీకి పంపించేందుకు కృషిచేస్తానని ఆయన అన్నారు. సంఘ కార్యదర్శి కొత్తపల్లి సుబ్రహ్మణ్యం గారి వందన సమర్పణతో సభ సమాప్తమైంది. నాగేశ్వరరావుగారు తిరిగి మద్రాసు చేరుకున్నారు.

## నెహ్రూ రష్యాయాత్రా చిత్రం

భారత ప్రధాన మంత్రి జవహర్లాల్ నెహ్రూ రష్యాపర్యటనను చూపించే వార్తా చిత్రం ఇటీవల విడుదలయింది. ఈచిత్రాన్ని రెండు భాగాలుగా విడుదల చేశారు. మొదటి భాగంలో మాస్కోనుండి టిబిలిసీవరకూ పర్యటన దృశ్యాలున్నాయి. ఈ వార్తా చిత్రాన్ని భారతప్రభుత్వపు ఫిలిమ్స్ డివిజన్ ఫొటోగ్రాఫర్ తీశారు.

మాస్కో విమానాశ్రయానికి పండిట్ నెహ్రూ విమానం రావడం, విమానాశ్రయంలో సోవియెట్ ప్రధాని బుల్గానిన్, కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి క్రుష్‌చెవ్, మాలెంకోవ్, మొలటోవ్ మున్నగు రష్యన్ నాయకులు ఆయనకు స్వాగతమివ్వడంతో ఈ రెండు రీళ్ల మొదటిభాగం ప్రారంభమవుతుంది. విమానాశ్రయంనుండి మాస్కో నగరంవరకూ నగర వీధులలో నూ నెహ్రూ, బుల్గానిన్‌లు కారులో పోతుండగా అటూ ఇటూ చేరిన వేలకొలది జనులు భారత నాయకుణ్ణి హర్ష నినాదాలతో, స్వాగతశబ్దాలతో ఎదుర్కొన్న దృశ్యాలు అత్యద్భుతంగా ఉన్నాయి. ప్రధాని రష్యాలో ఏ మారుమూలలకు వెళ్లినా అసంఖ్యాకులైన పురుషులు, స్త్రీలు, బాల

కాలికలు హృదయపూర్వకమైన స్వాగతం ఇవ్వడం ప్రతి భారతీయుడికీ ఆనందం కలిగిస్తుంది. స్రహూ మాస్కోలో దర్శించిన వ్యవసాయ యంత్ర నిర్మాణ కేంద్రం, బ్రహ్మాండమైన మాస్కో విశ్వవిద్యాలయం వ్యవసాయ ప్రదర్శనం మొదలైనవాటి దృశ్యాలు, స్టాలిన్‌గ్రాడ్, సెవాస్టపూల్, యాల్టా, జార్జియా ముఖ్యపట్టణం టిబిలిసి మొదలైనవాటి దృశ్యాలు కొంచెం సేపే కనిపించినా ఉత్సాహపూరితంగాను, భారతీయులయెడ, ప్రధానియెడల, ప్రపంచ శాంతియెడల రష్యన్లకు గల గాఢానురాగాన్ని సూచించేవిగా ఉన్నాయి.

# సినిమా వార్తలు

వినోదావారి "కన్యాశుల్కం" మరి కొద్ది రోజుల పనితో పూర్తి కానున్నది. ఇటీవల 'విశాఖపట్నంలో జయపురంవారి ధర్మసత్రం' సెట్‌పై రేవతీ స్టూడియోలో షూటింగ్ జరిగింది. సి. ఎస్. ఆర్., వంగర, సావిత్రి, సుధాకర్ మున్నగువారు పాల్గొన్నారు. ఆడవేషం వేసే శిష్యుడు పాత్ర సుధాకర్ ధరిస్తున్నారు. ఈ చిత్రం రషెస్ చూచినవారందరూ చాలా బాగున్నదని చెబుతున్నారు. వేళ్లమీద లెక్కపెట్టదగిన తెలుగునాటకాలలో ఒకటైన 'కన్యాశుల్కం' నాటకం ఆధారంగా తీసిన వినోదావారి చిత్రం ఆర్థికంగా విజయవంతం కాగలదని ఊహించవచ్చు.

* * *

శ్రీమతి లక్ష్మీరాజ్యం నిర్మిస్తున్న "హరిశ్చంద్ర" పౌరాణికచిత్రం ప్రారంభోత్సవం ఈ నెల 6వ తేదీన రేవతీలో జరిగింది. చంద్రమతి (లక్ష్మీరాజ్యం) గోమాతను సర్వశుభాలూ చేకూర్చవలసిందని ప్రార్థిస్తున్న దృశ్యం మొదటి షాట్‌గా తీయబడింది. ప్రసిద్ధ దర్శకులు ప్రసాద్ గారు కామెరా 'స్విచ్ ఆన్' చేశారు. నక్షత్రకుడుగా నటించే రేలంగి వెంకట్రామయ్యగారు 'క్లాప్‌బోయ్' గా పనిచేశారు. ప్రారంభోత్సవానికి సినిమారంగంలోని పలువురు వ్యక్తులు హాజరయ్యారు. ఈ చిత్రానికి జంపనవారు దర్శకులు.

* * *

ప్రతిభావారి "రేచుక్క" "శతదినోత్సవం ఈ నెల 3.వ తేదీన విజయవాడలో జరిగింది. అంజలీ దేవి, ఎన్. టి. రామారావు, పి. పుల్లయ్య, ప్రమీల, టి.వి.ఎస్. శాస్త్రి, డి. ఎల్. నారాయణ, సముద్రాల, సుందరలాల్ నహతా, బుచ్చిబాబు, కృష్ణమూర్తి గార్లు హాజరయ్యారు. అందరికీ బహుమానాలు సమర్పింపబడినవి. సముద్రాల వారు సభకు అధ్యక్షత వహించారు.

పి. పుల్లయ్యగారిదర్శకత్వాన ఈ ఏడాది మొదటి అర్థభాగంలో వెలువడి, శతదినోత్సవాలు జరుపుకున్న చిత్రాలలో ఇది రెండవది. మొదటిది "అర్ధాంగి"

* * *

విజయవాడ, బాలల చలన చిత్రోత్సవ కమిటీవారు ఏప్రిల్ 17 నుండీ విజయవాడలో బాలల చలన చిత్రోత్సవం జరుపుతూ బాలచిత్రాలు ప్రదర్శిస్తున్నారు. ఈ నెల 24-వ తేదీన విజయా టాకీస్‌లో యూనివర్సల్. ఇంటర్నేషనల్ వారి 10 కార్టూన్‌చిత్రాలు ప్రదర్శించనున్నారు.

* * *



జి. పి. సిప్పీ నిర్మించిన "అదిల్ - ఇ - జహాంగీర్"లో మీనాకుమారి, దుర్గాఖోటే.

ఎ. వి. ఎమ్. వారు నిర్మించిన తెలుగు చిత్రం "వదిన" త్వరలో విడుదల కాగల దని తెలుస్తున్నది. సావిత్రి, ఎ. నాగేశ్వర రావులు ఈ చిత్రంలో నటించారు. తమి ళంలో ఈ చిత్రం "చెల్లెపిళ్లై" పేరుతో విడుదలఅయి విజయవంతంగా నడుస్తున్నది.



## ఆంధ్ర ఫిలిం వాణిజ్య మండలి నూతన కార్యవర్గం

ఆంధ్రఫిలిం వాణిజ్యమండలి ద్వితీయ వార్షిక సమావేశం జులై 10వ తేదీన విజయవాడలో సుందరలాల్ నహతాగారి అధ్యక్షతన జరిగింది. సుమారు 70 మంది సభ్యులు హాజరయ్యారు.

నూతన సంవత్సరానికి శ్రీ సుందరలాల్ నహతా గారు అధ్యక్షులుగా, శ్రీయుతులు జి. కౌమరాజు, టి. అశ్వత్థ నారాయణ గారలు ఉపాధ్యక్షులుగా, శ్రీ యస్. కె. యన్. అయ్యంగార్, సి. వి. బాబురావు గారలు కార్యదర్శులుగా, శ్రీ చెరుకూరు పూర్ణచంద్రరావుగారు కోశాధికారిగా, శ్రీయుతులు రాజా. ఎ. మోహన్, పి. చంద్రశేఖరరావు, బి. అత్మయలింగం, కాశీ నాథుని సుబ్రహ్మణ్యం, కె. సుబ్బారావు, బి. సత్యనారాయణ, సయ్యద్ ఖాదర్ గారలు సభ్యులుగా నూతన కార్యవర్గం ఎన్నుకోబడింది.

ఆంధ్రప్రభుత్వం తలపెట్టిన నూతనవిద్యుచ్ఛక్తి రేట్లు అమలు జరుపకుండా హైకోర్టులో రిట్టు దాఖలు చేయుటకు నిర్ణయించబడింది.

"అగ్రిగ్రాంట్లు ఫిలిమ్సు" విషయంలో రిట్టు దాఖలు చేసినవిషయం పాఠకులకు విదితమే.

(స్వకీయ విలేఖరి)



ఇటీవల విడుదల అయిన విఠల్ ప్రొడక్షన్స్ "కన్యాదానం" సెట్స్‌పై వర్కింగ్ స్టిల్: దర్శకులు విఠల ఆచార్య, రాజనాల, అసోసియేట్ డైరెక్టర్లు: అడ్డాల, గరికపర్తి సుబ్రహ్మణ్యం, కెమేరా ఎమ్. ఎస్. మణి మున్నగువారు.

## గ్రంథస్వీకారం

**ఇంద్రాణి:**— కథల సంపుటి; కర్త దాసరి సుబ్రహ్మణ్యం; ప్రతులకు, తెలుగునాడు, రేపల్లె, గుంటూరు జిల్లా; వెల 1-0-0.

ఈ సంపుటిలో సుబ్రహ్మణ్యంగారి కథలు తుమ్మెల్లో అస్తమయం, తెరపడని తలుపు, సినిమాఛాన్స్, కల-నిజం, ఉద్యోగ ధర్మం, ధనిక వితంతువు, అవ్యక్తం, ఇంద్రాణి అనేవి 8 ఉన్నవి.

**ఋణానుబంధం:**— కథల సంపుటి; కర్త తూలికాభూషణ్; వెల 2-0-0; ప్రతులకు వెంకట్రామా అండ్ కో., విజయవాడ—కర్నూలు.

వివిధ పత్రికలలో చాలాకాలంగా కథలు వ్రాస్తూవచ్చినతూలికాభూషణ్ గారు తమ కథలలో పద్నాలుగింటిని పుస్తక రూపంలో ప్రకటించారు. సాధారణంగా వీరి కథలలో మధ్యతరగతివ్యక్తులు, కుటుంబాలు పడే ఆర్థికబాధలు చిత్రితాలవుతాయి. డబ్బుదగ్గరకొచ్చేసరికి మానవులప్రవర్తనలో మంచి చెడ్డలు ఎలా బయటపడుతూ ఉంటాయో వీరు వేదనతో కూడిన వ్యంగ్య దృష్టితో పరిశీలిస్తారు. శైలిలో వ్యంగ్యం, హాస్యం, ధారాశుద్ధి కనబడతాయి.



విజయవాడ, వినోదా పిక్చరు ప్యాలెస్‌లో "రేచుక్క" శతదినోత్సవ సందర్భములో సన్మానితులైన
ఎన్. టి. రామారావు, అంజలి, ప్రమీల.



శతదినోత్సవ సభకు అధ్యక్షత వహించిన శ్రీ సముద్రాల, దర్శకుడు పి. పుల్లయ్య, నిర్మాత కృష్ణమూ
ర్తి, [illegible] అధిపతి సుందరలాల్ నహాతా.

Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor: S. Sambhu Prasad.



తిరిగి దొరికిన మేక

ఫోటో : పి. రామారావు—రాజమండ్రి.

# ఈ ఆశ్చర్యకరమైన రాత్రి పగలు
## చర్మ రక్షణ సాధనతో
# మీ చర్మమును సొగసుగ మరియు మనోహరముగ ఉంచుకోండి

**విశేషమైన పాండ్స్ కోల్డ్ క్రీమ్ మరియు మంచువలెనున్న పాండ్స్ వేనిషింగ్ క్రీములు మీ చర్మమునకు రక్షణనిచ్చి దానిని మృదువుగ, అందముగ ఉంచును.**




**చర్మమును మృదువుగ, నిర్మలముగ చేయుటకు రాత్రి వాడే క్రీము**

మీరు పండుకునేముందు విశేషమైన పాండ్స్ కోల్డ్ క్రీమ్ వాడండి. అది కొన్ని సెకండ్లలోనే మీ చర్మమునకు కావలసిన సహజమైన నూనెలు మరియు తేమ లోపములను పూర్తిచేసి యథాస్థితికి తెచ్చుటయే కాక దానిని లేతగా మరియు మనోహరముగా ఉంచుటలో సహకరించును.

పాండ్స్ కోల్డ్ క్రీమ్ అద్భుతముగ చర్మమును శుభ్రపరచును. రోమ రంధ్రములు పెద్దవి కాకుండా రక్షణనిచ్చి మీ చర్మమును బహు నిర్మలముగ, నిష్కళంకముగ ఉంచును.









**చర్మమును కాపాడుటకు మరియు సుందరముగ చేయుటకు పగలు వాడే క్రీము**

తేలికగ మరియు మంచువలెనున్న పాండ్స్ వేనిషింగ్ క్రీమ్ పైపైన ముఖమునకు రాసుకుంటే పగటివేళ మీ అందమును అధికము చేస్తుంది. మనోహరము, నిష్కళంకమైన చర్మమును పాడుచేయు దుమ్ము, సూర్యరశ్మి మరియు వడగాడ్పుల నుండి యిది మీ చర్మమునకు సౌమ్యరక్షణ నిచ్చును.

మరియు పాండ్స్ వేనిషింగ్ క్రీమ్ మరీ జిడ్డుగా ఉండే చర్మమునకు ఒక అద్భుతమైన సాధనము—దీనితో రోమ రంధ్రములను అడ్డి కళంకము కలిగించే అధికమైన నూనెలు లేకుండా చేయవచ్చును.

## పాండ్స్
### కోల్డ్ క్రీమ్
### వేనిషింగ్ క్రీమ్

ప్రతిచోట అందమైన స్త్రీలు వారి సౌందర్య రక్షణకు ఈ రెండు క్రీములనే వాడుతున్నారు. మీరూ వారివలె పాండ్స్ కోల్డ్ క్రీమ్ రాత్రి మరియు పాండ్స్ వేనిషింగ్ క్రీమ్ పగలు వాడండి. త్వరలోనే నవవికసిత పుష్పమువలెనున్న మీ ముఖమును చూచుకొని మీరు చకితులౌతారు.